




శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ
వేదాంతప్రవర్తకులైన, శ్రీమత్పరమహంస
పరివ్రాజకాచార్యులైన తిరుమల తిరుపతి
తిన్ననూ్నరు దేవస్థానములకు ధర్మకర్తలైన
పెరియ కోవిల్ కేళ్వి అప్పన్

**శ్రీ శఠకోపరామానుజజీయర్‌స్వామివారు**

**నారాయణ స్మరణపూర్వకముగా వ్రాయించి పంపిన పత్రిక**

# మంగళాశాసనము

**శ్రీ వేంకటాద్రినిలయః కమలాకాముకః పుమాన్ ।**
**అభంగురవిభూతిర్నః తరంగయతు మంగళమ్ ॥**

శ్రియఃపతి అయిన సర్వేశ్వరుని నిర్హేతుకకటాక్షంవల్ల **“మయర్వఱ మదినలమ్”** అనే రీతిలో నిర్దుష్టమైన, భక్తిరూపంగా పండిన జ్ఞానాన్ని పొందిన నమ్మాZ్వార్లు **తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొZ** అనే నాలుగు దివ్యప్రబంధాలను అనుగ్రహించారు. ఈ నాలుగు వరుసగా ఋగ్వేద, యజుర్వేద, అధర్వణవేద, సామవేద సారాలని పూర్వాచార్యులు తెలిపారు. వీటిలో రెండవ ప్రబంధమైన తిరువాశిరియమ్ ఆశిరియప్పా ఛందస్సులో రచింపబడ్డ ఏడు పాశురాలతో కూడుకొన్నది. భగవానుని యొక్క దివ్యమంగళ విగ్రహాన్ని, కల్యాణగుణాలను పూర్ణంగా అనుభవించి, ఆ అనుభవంవల్ల తమకు కల్గిన ఆనందాన్ని నమ్మాZ్వార్ ఈ ప్రబంధంలో వ్యక్తం చేశారు. తిరువాశిరియమ్ ప్రబంధంలోని పాశురాలు యజుర్వేదసారమైన నారాయణానువాకంయొక్క అర్థాన్ని అనుసంధిస్తున్నవని పెద్దలు అంటారు.

ఈ దివ్యప్రబంధానికి పరమకారుణికులైన పెరియవాచ్చాన్‌పిళ్ళై రసబంధురమైన మణిప్రవాళవ్యాఖ్యను అనుగ్రహించారు. ఈ వ్యాఖ్య సంస్కృత, ద్రావిడభాషలు తెలిసిన పండితులకు మాత్రమే అందుబాటులో ఉన్నందున, తెలుగువారు ఈ ప్రబంధంలోని

వైభవాన్ని తెలిసి, ఈ వ్యాఖ్యలోని మాధుర్యాన్ని ఆస్వాదించే అవకాశం లేదు. అందువల్ల ఇటువంటి వ్యాఖ్య ఆంధ్రీకరింపబడవలసిన ఆవశ్యకత ఉన్నది అనే విషయాన్ని గుర్తించి, సమర్థవంతంగా దానిని ఆంధ్రీకరణను చేసిన తిరుపతి వాస్తవ్యులైన **శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు** అభినందనీయులు. వీరు పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానాన్నే కాక, గత శతాబ్దిలో శ్రీరామానుజ దర్శనాన్ని ద్రావిడ, సంస్కృత, ఆంధ్ర, హిందీ భాషలలో సహస్రాధిక గ్రంథాల ప్రచురణద్వారా, ఉపన్యాసాల ద్వారా అద్వితీయంగా ఆసేతుహిమాచలం ప్రచారం చేసిన మహనీయులు, కీర్తిమూర్తులు, **కాంచీ మహావిద్వాన్, పద్మవిభూషణ, ఉ.వే.శ్రీమాన్ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు** రచించిన దివ్యార్థదీపిక వ్యాఖ్యను , తిరుపతి వాస్తవ్యులు, సుప్రసిద్ధ విద్వాంసులు, కీర్తిమూర్తులు, **శ్రీవైష్ణవసింహ ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు** ద్రావిడభాషలో రచించిన తిరువాశిరియప్రబంధ తాత్పర్యాన్ని అనువదించడం చాలా సంతోషదాయకం. తిరువేఙ్గడముడైయాన్ అనుగ్రహంవల్ల శ్రీమాన్ శింగరాచార్యులకు అన్నివిధాలైన శుభాలు కలగాలని మేము అనేక మంగళాశాసనాలను చేస్తున్నాము.

ఈ సద్గ్రంథాన్ని ప్రచురిస్తున్న **శ్రీరామానుజ సిద్ధాంతసభ, సికింద్రాబాద్** వారిని హార్దికంగా అభినందిస్తున్నాము. ఇందుకు తోడ్పడిన సహృదయులు **ఉ.వే. శ్రీమాన్ కె.కె.పరకాలన్‌స్వామివారికి, శ్రీమాన్ స్వామిదాసుగారికి** శ్రీపద్మావతీ సమేత శ్రీనివాస భగవానుని కృపవల్ల అన్ని శ్రేయస్సులు కలగాలని అనేక మంగళాశాసనాలను చేస్తున్నాము. శ్రీరామానుజ సిద్ధాంతసభ ద్వారా ఇటువంటి మంచిగ్రంథాలు ఇంకా భవిష్యత్తులో ముద్రింపబడాలని తిరువేఙ్గడముడైయాన్ శ్రీపాదాలలో సేవించి, ప్రార్థిస్తూ అనేక మంగళాశాసనాలను చేస్తున్నాము.

**రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్.**

SRI PEDDA JEEYANGAR VARU
Sri H.H. Pedda Jeeyangar Mutt
Tirupati.

పెరియ కోవిల్ కేళ్వి అప్పన్
శ్రీశఠకోపరామానుజ పెద్దజీయర్ స్వామివారు

తిరుపతి
29-12-2010

# శ్రీరామానుజ సిద్ధాంతసభ, సికింద్రాబాద్
## (సంగ్రహ నివేదిక)

శ్రీరామానుజ సిద్ధాంత సభ 1990వ సంవత్సరం అక్టోబరునెలలో జంటనగరాలలో నివసించే శ్రీవైష్ణవుల ప్రయత్నఫలంగా, పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ వానమామలై రామానుజీయర్ స్వామి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనాలతో ప్రారంభించబడింది. ఈ సంస్థ ముఖ్యోద్దేశ్యాలు క్లుప్తంగా -

1) భగవద్రామానుజ సిద్ధాంతతత్త్వాలను ప్రచారం చేయడం.
2) శ్రీవైష్ణవసంప్రదాయాన్ని ప్రచారం చేయడం, పరిరక్షించడం.
3) భగవద్రామానుజుల ఆశలను, ఆశయాలను సాధ్యమైనంతలో ఆచరించడం.
4) శ్రీజీయర్‌స్వాములను, పండితులను ఆహ్వానించి గౌరవించడం, వారి ప్రయత్నాలకు సహక రించి సహాయపడడం ద్వారా సనాతనధర్మాన్ని పరిరక్షించడం.
5) శ్రీవైష్ణవాలయాలలో కైంకర్యాన్ని చేసే శ్రీవైష్ణవులకు వైద్యసౌకర్యార్థం ఆర్థిక సహాయాన్ని అందించడం.
6) ఉపనయనాలను చేసికోవడానికి ఆర్థికసహాయాన్ని చేయడం.
7) ప్రసిద్ధపండితులతో ఉపన్యాసకార్యక్రమాలను నిర్వహించడం.
8) జంటనగరాలలో, ఇతరప్రాంతాలలో ఉండే శ్రీవైష్ణవాలయాలలో ఉత్సవ - విశేషసందర్భాలలో నాలాయిరదివ్యప్రబంధ పారాయణను నిర్వహించడం.
9) శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన గ్రంథాల, కరపత్రాల ప్రచురణకు, ఇతర ప్రచురణలకు ఆర్థికసహాయాన్ని అందివ్వడం.
10) నాలాయిర దివ్యప్రబంధంలో, శ్రీవైష్ణవ సహస్రనామాది స్తోత్రాలలో చిన్నపిల్లలకు పోటీలుపెట్టి బహుమతులను ఇవ్వడంద్వారా ప్రోత్సహించడం.
11) భగవద్రామానుజుల అవతారోత్సవాలలో, మిగిలిన విశేషోత్సవ సమయాలలో శ్రీవైష్ణవాలయాలలో సేవలను అందించడం.

ఈ ఆశయాలకు, ఉద్దేశ్యాలకు అనుగుణంగా శ్రీరామానుజసిద్ధాంత సభ ఈ క్రింది జీయర్ స్వాములను, పండితులను (1990 - 2010 మధ్యకాలంలో) ఆహ్వానించి గౌరవించింది.

1) శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీవానమామలై జీయర్ స్వామివారు (29వ పట్టం) - సెప్టెంబరు-1991.

2) శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారు - అక్టోబరు 1991.

3) ఉ.వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్, శ్రీరంగం, అక్టోబరు 1991.

4) శ్రీశ్రీశ్రీ అహోబిల జీయర్ స్వామివారు - జనవరి 1994.

5) శ్రీమాన్ సర్వోపకారశెట్టి, శ్రీరామానుజ సుప్రభాతగోష్ఠి, మద్రాసు-నవంబరు, 1994.

6) ఉ.వే. శ్రీమాన్ శ్రీవేంకటేశ అయ్యంగార్ (ఎస్.పి.పి.ఎస్.) కమిటీ, మే,1995.

7) శ్రీశ్రీశ్రీ ఆండవన్ జీయర్స్వామివారు, ఆండవన్ ఆశ్రమం - జననం, 1996.

8) ఉ.వే. శ్రీమాన్ ముదలియాండాన్ స్వామివారు - సెప్టెంబరు 1996.

9) ఉ.వే. శ్రీమాన్ తిరుమణి స్వామివారు - సెప్టెంబరు 1996.

10) ఉ.వే. శ్రీమాన్ వేలుక్కుడి కృష్ణన్ స్వామివారు - సెప్టెంబరు 1999

11) ఉ.వే. శ్రీమాన్ ఇళైయవిల్లి శ్రీనివాస భూవరాహాచార్యస్వామివారు, ఆZ్వార్ తిరునగరి- సెప్టెంబరు 1996-2000.

12) ఉ.వే. శ్రీమాన్ శఠకోపాచార్యస్వామివారు, తిరువాయ్మొZిప్పిళ్ళైస్వామి, ఆZ్వార్ తిరునగర్ - సెప్టెంబరు 1996-2000.

13) ఉ.వే. శ్రీమాన్ వి.వి. రామానుజమ్ స్వామివారు, సంపాదకులు, యతిరాజ పాదుక - సెప్టెంబరు 1996-2000.

14) శ్రీశ్రీశ్రీ వానమామలై జీయర్స్వామివారు (30వ పట్టం) - సెప్టెంబరు 1996-2000.

15) ఉ.వే. శ్రీమాన్ ఎం.ఎ. వేంకటకృష్ణన్ స్వామివారు, చెన్నై - సెప్టెంబరు 1996-2000.

16) ఉ.వే. శ్రీమాన్ గోమఠం పాదూర్ మన్నన్ కోయిల్ నడక్కు తిరుమాళిగై శ్రీమాన్ మణవాళమునిగళ్ వంశావళి శ్రీరామానుజాచార్యర్ స్వామి - ఫిబ్రవరి 1996.

17) కీర్తిమూర్తులు పరమహంస పరివ్రాజకాచార్య తిరుమలై తిరుపతి పెరియకేళ్వి జీయర్స్వామివారు, తిరుమల - 2003-04

18) ఉ.వే. శ్రీమాన్ రమాకాంతాచార్య స్వామివారు- 2003-04

19) శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య వానమామలై జీయర్స్వామి,వానమామలై మఠం (30పట్టం) - 2005-06

20) శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారు- 2005-06

21) ఉ.వే. శ్రీమాన్ బదరీనారాయణ భట్టర్స్వామివారు, శ్రీరంగం-2007-2008.

22) ఉ.వే. శ్రీమాన్ మేల్కొట్టై సంపత్కుమారాచార్యస్వామివారు, 2007-08.

23) ఉ.వే. శ్రీమాన్ ఎం.ఏ. వేంకట కృష్ణన్ స్వామివారు, సంపాదకులు, గీతాచార్యన్, చెన్నై - 2007-08.

24) పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ యతిరాజ రామానుజ జీయర్ స్వామివారు, శ్రీపెరుంబూదూర్ - 2008-09.

25) ఉ.వే. శ్రీమాన్ అక్కారక్కని శ్రీనిధిస్వామివారు, కాంచీపురం - 2008-09.

26) శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీరామానుజ జీయర్స్వామివారు, వానమామలై మఠం, శ్రీవిల్లిపుత్తూరు - 2008-09.

27) శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్స్వామివారు, 2009-10

28) ఉ.వే. శ్రీమాన్ కపిస్థలం శ్రీనివాసాచార్యస్వామివారు, శ్రీరంగం - 2009-10

వీరేకాక ఇంకా పలువురు జీయర్స్వాములు, పండితులు సంమానింపబడ్డారు.

**శ్రీరామానుజ సిద్ధాంత సభద్వారా తిరుప్పావై ప్రవచనాన్ని చేసిన పండితులు.**

**1990-91** - ఉ.వే. శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యస్వామివారు, హైదరాబాద్

**1991-92** - ఉ.వే. శ్రీమాన్ కోరుకొండ పరాశర సుదర్శన భట్టర్ స్వామివారు, కోరుకొండ.

**1992-93** - ఉ.వే. శ్రీమాన్ చిక్కుడుగాయ రంగాచార్య స్వామివారు, హైదరాబాద్

**1993-94** - ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల శ్రీనివాసాచార్యస్వామివారు.

**1993-94** - ఉ.వే. శ్రీమాన్ శ్రీసీతారామచార్యస్వామివారు, వరంగల్లు

**1994-95** - ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యస్వామివారు, వరంగల్లు

**1995-96** - ఉ.వే. శ్రీమాన్ శ్రీరంగనాథాచార్యస్వామివారు, నెల్లూరు.

**1996-97** - ఉ.వే. శ్రీమాన్ శ్రీరామానుజాచార్యస్వామివారు, నెల్లూరు.

**1998-99** - ఉ.వే. శ్రీమాన్ శ్రీ స్థలశయనంస్వామివారు, ఒంగోలు

**1999-2000** - ఉ.వే. శ్రీమాన్ శ్రీరామానుజాచార్యస్వామివారు, ఒంగోలు

**2000-2001** - ఉ.వే. శ్రీమాన్ కందాడై రామానుజాచార్య స్వామివారు, హైదరాబాద్

**2002-2003** - ఉ.వే. శ్రీమాన్ కందాడై వరదరామానుజాచార్య స్వామివారు, తిరుపతి

**2003-2004** - ఉ.వే. శ్రీమాన్ ఇరగవరపు శ్రీరామాచార్యస్వామివారు, రాజమండ్రి

**2004-2005** - ఉ.వే. శ్రీమాన్ ఇరగవరపు శ్రీరామాచార్యస్వామివారు, రాజమండ్రి

**2005-2006** - ఉ.వే. శ్రీమాన్ శ్రీకులశేఖరస్వామివారు, హైదరాబాద్

**2006-2007** - ఉ.వే. శ్రీమాన్ శ్రీరఘునాథాచార్యర్ స్వామివారు, హైదరాబాద్

**2007-2008** - ఉ.వే. శ్రీమాన్ కె.కె.ఏ. శ్రీరంగరాజన్ స్వామివారు, తిరుపతి

**2008-2009** - ఉ.వే. శ్రీమాన్ కోరుకొండ పరాశర రఘునాథ భట్టర్స్వామివారు, కోరుకొండ

**2009-2010** - ఉ.వే. శ్రీమాన్ సంపత్కుమారాచార్యస్వామివారు, బాపట్ల

శ్రీరామానుజ సిద్ధాంత సభద్వారా పలు పండిత సభలు, ఉపన్యాస కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. వాటిలో కొన్ని క్లుప్తంగా -

ఉ.వే. శ్రీమాన్ ఇరగవరపు శ్రీరామాచార్యస్వామిచే భాగవతప్రవచనం.

ఉ.వే. శ్రీమాన్ కందాడై రామానుజాచార్యస్వామిచే శ్రీరామాయణం ప్రవచనం.

ఉ.వే. ఇరగవరపు శ్రీరామాచార్యస్వామివారి (రాజమండ్రి) చే తిరువాయ్మొZ -ఈడు వ్యాఖ్యాన ప్రవచనం. (ఇది కొనసాగుతున్నది).

2006 సెప్టెంబరు నెలలో పెరియతిరుమొZిలోని "ఏZై ఏదలన్" దశకం పై పండితులచే ఉపన్యాసాలు నిర్వహింపబడ్డాయి.

సభద్వారా శ్రీలక్ష్మీనారాయణస్వామివారి కోవెల, సికింద్రాబాద్లో శ్రీరామానుజుల అవతారోత్సవం, శ్రీనమ్మాZ్వార్ తిరునక్షత్రం, ఆణ్డాళ్ తిరువాడిప్పూరం మొదలైన ఆZ్వార్ల, ఆచార్యుల అవతారోత్సవాలలో పండితోపన్యాసాలు నిర్వహింపబడుతున్నాయి. సభద్వారా మంగైమాడమ్ తిరుమంగై ఆZ్వార్ల అవతారస్థలంలో మే 2006లోను, శ్రీకూరం గ్రామంలో కూరత్తాZ్వాన్ సహస్రాబ్ది ఉత్సవాల సందర్భంగా ఫిబ్రవరి 2010లోను తదీయారాధనను నిర్వహించింది.

శ్రీరామానుజ సిద్ధాంత సభను స్థాపించిననాటినుండి ఈ క్రింది కమిటీ సభ్యులు నిస్స్వార్థమైన రీతిలో సభ కార్యక్రమాల నిర్వహణకోసం తమ అమూల్యమైన సేవలను స్వచ్ఛందంగా అందిస్తున్నారు. వారికి హార్దిక కృతజ్ఞతలు.

**ఎ)** ఉ.వే.శ్రీమాన్ వేణుగోపాలన్ అయ్యంగార్ స్వామివారు **(సలహాదారు)** ప్రధానార్చకులు, శ్రీలక్ష్మీనారాయణస్వామి కోవెల, సికింద్రాబాద్.

**బి)** ఉ.వే. శ్రీమాన్ కె.వి. శెల్వమణిస్వామివారు, **(సలహాదారు)** దక్షిణమధ్య రైల్వే సూపరింటెండెంట్ (రిటైర్డు).

**1)** ఉ.వే. శ్రీమాన్ కె.కె. పరకాలన్‌స్వామివారు, ప్రెసిడెంట్ (ప్రింటింగ్ ప్రెస్ మేనేజర్, రిటైర్డు, మింట్, హైదరాబాద్).

**2)** శ్రీమాన్ జి.స్వామిదాస్‌గారు, సెక్రటరీ (రిటైర్డు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్-ఆర్&బి)

**3)** ఉ.వే. శ్రీమాన్ టి.ఎన్. రాఘవన్‌స్వామివారు, ట్రెజరర్ డిప్యూటీ ఫైనాన్షియల్ అడ్వైజర్ (రిటైర్డు), ద.మ. రైల్వే.

**4)** ఉ.వే. శ్రీమాన్ ఆర్. పద్మనాభన్ స్వామివారు, జాయింట్ సెక్రటరీ అకౌంటెంట్, ఫెన్నర్ (ఇండియా) లి., హైదరాబాద్.

**5)** శ్రీమాన్ పి.ఎన్. నాయుడు గారు, ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబర్, రిటైర్డు కంపెనీ సెక్రటరీ, కోరమాండల్ ఫెర్టిలైజర్స్, హైదరాబాద్.

**6)** శ్రీమాన్ కె.వాసుదేవగుప్తగారు, ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబర్, రిటైర్డు హెచ్.ఓ. కమలా నెహ్రూ పాలిటెక్నిక్ కాలేజి.

**7)** శ్రీమాన్ జి. వెంకటరావుగారు, ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబర్, రిటైర్డు మేనేజర్, దేనాబ్యాంక్. హైదరాబాద్

**8)** శ్రీమాన్ శశిధర్, ఏక్టివ్ కమిటీ మెంబర్, లెక్చరర్, బద్రుకా కాలేజి, హైదరాబాద్.

శ్రీరామానుజ సిద్ధాంతసభ కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొనే కైంకర్య పరులను అందరినీ సభ సాదరంగా ఆహ్వానిస్తున్నది.

శ్రీ రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్.

# తిరువాశిరియం - ప్రవేశిక

**వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్ ।**
**యశ్శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా ॥**

**"అనంతా వై వేదాః"** అని అంటూ వేద పురుషుడే స్వయంగా వేదాలు అనంతాలని అన్నాడు. ఈ వేదాలు అపౌరుషేయాలు, నిత్యాలు. ఆయా యుగాలలో భగవానుని అనుగ్రహంవల్ల మహర్షులద్వారా వ్యక్తమై లోకానికి అందాయి. వేదపురుషుడు **"నమో వాచే యాచోదితా యాచానుదితా"** అని అంటూ మహర్షులద్వారా ఉదయించిన వేదాన్ని **"ఉదితా"** అనే శబ్దంతో నిర్దేశించి, భవిష్యత్తులో దివ్యసూరులద్వారా వ్యక్తం కాబోయే ద్రావిడవేదాన్ని **"అనుదితా"** అనే పదంతో సూచించాడు. సంస్కృతవేదంవలె ద్రావిడ వేదం కూడా అనాది, అపౌరుషేయం అని, సంస్కృతవేదాన్ని భగవానుడు బ్రహ్మకు ఉపదేశించినట్లే నమ్మాళ్వార్లకు భగవానుడు ద్రావిడవేదాన్ని **"పీతకవాడైపిరానార్ పిరమ కురువాకి వన్దు ఇరాప్పుకల్ ఓదువిత్తు"** అనే రీతిలో ఉపదేశించాడని, సంస్కృత వేదం ఋగాది చాతుర్విధ్యాన్ని కల్గి ఉన్నట్లే, ద్రావిడవేదంకూడా తిరువిరుత్తాది రూపేణ చాతుర్విధ్యాన్ని కల్గి ఉన్నదని, ఋగ్వేదం సామవేదరూపంలో విస్తృతమైనట్లే, ఋగ్వేద స్థానీయమైన తిరువిరుత్తం తిరువాయ్‌మొழి రూపంలో విస్తృతమైనదని- ఈవిధంగా సంస్కృత ద్రావిడ వేదాల మధ్యగల పలు సామ్యాలు. ఆచార్యహృదయమనే రహస్య గ్రంథంలో సప్రమాణంగా నిరూపింపబడ్డాయి.

నమ్మాళ్వార్ల నాల్గు దివ్యప్రబంధాలు ఋగాది నాల్గు వేదాల సారాలని సంప్రదాయం. వాటిలో - ఋగ్వేదసారం తిరువిరుత్తం, యజుర్వేదసారం తిరువా శిరియం, అధర్వణవేదసారం పెరియతిరువందాది, సామవేదసారం తిరువాయ్‌మొழி. ఈ విషయం అచార్యహృదయంలో - **"ఇయల్ మూన్ఱుమ్ వేదత్రయమ్‌పోలే పణ్ణార్‌పాడల్ పణ్బురై యిశైకొళ్ వేదమ్‌పోలే"** అని తెలుపబడింది.

తిరువిరుత్తం ఋగ్వేదంలోని విష్ణుసూక్తాల సారాన్ని వివరించగా, ఏడు కాండలను కల్గిన యజుర్వేదంయొక్క సారమైన నారాయణానువాకంయొక్క అర్థాన్ని ఏడు పాశురాలను కల తిరువాశిరియం వివరిస్తున్నది. అధర్వణవేదాంతర్గతాలైన ముండకాద్యుపనిషత్తుల అర్థాన్ని పెరియతిరువందాది వివరిస్తున్నది. వేయి శాఖలతో కూడిన సామవేదంయొక్కసారం అయిన ఛాందోగ్యాన్ని వేయి పాశురాలను కల తిరువాయ్‌మొழி వివరిస్తున్నది. ఈ విధంగా నమ్మాళ్వార్ల నాల్గు ప్రబంధాలు నాల్గు వేదాల సారార్థాల ప్రతిపాదకాలు.

నమ్మాళ్వార్ల ప్రబంధాల నాల్గు రహస్యత్రయవివరణాత్మకాలు అనే అర్థ నిర్వాహంకూడా ఉన్నది. అష్టాక్షరిలోని ప్రణావార్థాన్ని, నమశ్శబ్దార్థాన్ని తిరువిరుత్తం వివరిస్తున్నది. **“నారాయణాయ”** అనే పదంయొక్క అర్థాన్ని తిరువాశిరియం వివరిస్తున్నది. చరమ శ్లోకార్థాన్ని పెరియతిరువన్దాది వివరిస్తున్నది. ద్వయమంత్రార్థాన్ని తిరువాయ్‌మొళి వివరిస్తున్నది.

తిరుమంత్రంలోని ప్రణవంద్వారా జీవుని అనన్యార్హశేషత్వం తెలుపబడగా, నమశ్శబ్దంద్వారా అనన్యశరణత్వం తెలుపబడింది. అంటే - జీవుడు అకారశబ్ద వాచ్యుడైన పరమాత్మకే శేషభూతుడని ప్రణవం తెలుపగా, ఆ భగవానుడే ఉపాయమనే విషయాన్ని నమశ్శబ్దం తెలుపుతున్నది. ఈ విషయాలను రెండిటిని తిరువిరుత్తం వివరిస్తున్నది. ఆ ప్రబంధప్రారంభంలో **“అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్”** అని అంటూ **“అడియేన్”** అనే పదాన్ని ప్రయోగించడం ద్వారా ఆళ్వార్లు జీవుని అనన్యార్హశేషత్వాన్ని తెలిపారు. **“అడియేన్”** అనే పదం శేషత్వవాచకం కదా! ఆ ప్రబంధంలో చివర **“ఞానప్పిరానై యల్లాల్ ఇల్లై నాన్ కణ్డనల్లదువే”** అని అంటూ జీవుని అనన్యశరణత్వాన్ని ఆళ్వార్లు నిష్కర్షించి తెలియజేశారు. మధ్యలో ఉండే పాశురాలలో ఈ రెండు విషయాలు వివరింపబడ్డాయి.

ఇక, రెండవ ప్రబంధం తిరువాశిరియం - అష్టాక్షరిలోని **“నారాయణాయ”** అనే చివరి పదంయొక్క అర్థాన్ని అనుసంధిస్తున్నది. ఈ పదం జీవుని అనన్య భోగ్యత్వాన్ని- అంటే పురుషార్థాన్ని తెలుపుతున్నది. తిరువాశిరియంలోని **“శెక్కర్ మామకిల్ ఉడుత్తు”** అని ప్రారంభమైన మొదటి పాశురంలో శ్రియఃపతియొక్క స్వరూపరూపగుణవిశేషాలను అనుభవించారు. ఇవి నారాయణశబ్దార్థమే కదా! రెండవ పాశురంలో **“నేరియ కాదల్ అన్బిల్ ఇన్బీన్ తేఱల్ అముదవెళ్ళమ్”** అని అంటూ స్వయంప్రయోజనం అయిన భక్తిని, **“తనిమాద్దెయ్‌వత్తు అడి యవర్క్కు ఇని నామ్ ఆళాకవే ఇశైయుజ్గొల్”** అని అంటూ చరమపర్వం అయిన భాగవత విషయంలోని కైంకర్యమనే పరమపురుషార్థాన్ని ప్రార్థించారు. ఇది **“ఆయ”** శబ్దార్థం. అదే విధంగా నాల్గవ పాశురంలో **“మాయక్కడవుళ్ మా ముదల్ అడియే... ఊళిదోరూళి యోవాతు వాళియ ఎన్ఱు యామ్ తొఴ ఇశైయుజ్కొల్”** అనిఅంటూ ప్రథమ పర్వమైన భగవానుని విషయంలో చేసే మంగళశాసన కైంకర్యమనే పరమపురుషార్థం వివరింపబడింది. ఇదికూడా ఆయశబ్దార్థమే. ఈ విధంగా తిరువాశిరియప్రబంధంలో అష్టాక్షరిలోని పురుషార్థ ప్రకాశకమైన **“నారాయణాయ”** అనే మూడవ పదంయొక్క అర్థం సాకల్యంగా అనుసంధింపబడింది.

## నమ్మాళ్వార్ల నాల్గు ప్రబంధాలలో అనుభవం - భరతాళ్వాన్ అనుభవం

నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొழிకి ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యను అనుగ్రహించిన నమ్పిళ్ళై ముందుగా మూడు విధాలైన అవతారికలను ప్రసాదించారు. వాటికి శ్రియఃపతులనిపేరు. ఈ అవతారికలు అన్నీ **"శ్రియఃపతియాయ్"** అనే పదంతో ప్రారంభం అవుతున్నందున వీటికి ముదల్ శ్రియఃపతి, ఇరణ్డామ్ శ్రియఃపతి, మూన్ఱామ్ శ్రియఃపతి అనే పేర్లు వచ్చాయి. మూడవ శ్రియఃపతిలో నమ్మాళ్వార్లు తమ నాల్గు ప్రబంధాలలో వ్యక్తంచేసిన అనుభవం - శ్రీరామాయణంలో భరతాళ్వాన్ అనుభవంలో పోలి ఉన్నదని నమ్పిళ్లై తెలిపారు. ఆ సామ్యం సంగ్రహంగా ఇక్కడ తెలుపబడు తున్నది.

భగవానుడు నమ్మాళ్వార్లకు నిర్హేతుకకరుణతో భ్రమవిప్రలంభవిస్మృత్యాది దోషరహితమైన, భక్తిరూపంగా పరిణమించి జ్ఞానాన్ని ప్రసాదించాడు. దానివల్ల ఆళ్వార్లకు అచిత్తు త్యాజ్యమని, చిత్తు ఉపాదేయమని, ఈశ్వరుడు ఉపాదేయ తముడని తెలిసింది. అపుడు భగవత్ప్రాప్తికి, కైంకర్యానికి తమకు విరోధిగా దేహసంబంధం ఉండడంవల్ల, ఆ శరీరరసంబంధాన్ని తీర్చి అనుగ్రహించమని తమ ఆర్తిని ఆవిష్కరిస్తూ తిరువిరుత్తం అనే మొదటి ప్రబంధంలో ఆళ్వార్లు ప్రార్థించారు. ఈ ఆర్తి దేనితో పోలి ఉన్నది? అనిఅంటే, శ్రీరామచంద్రునకు పట్టాభిషేకం అవుతుందని, అతనికి అభిమతమైన కైంకర్యాలను చేసి అతనిని ఆనందింపజేయాలని ఆశపడ్డ భరతుడు అయోధ్యకు వచ్చినపుడు కైకేయి "రాజన్" అని సంబోధించింది. అపుడు ఆ సంబోధనను విని భరతుడు పొందిన ఆర్తివంటిదే ఇది.

సంసారసంబంధం తీరి పరమపదాన్ని చేరితే అక్కడ అనుభవించదగిన తన పరత్వసౌలభ్యాలను, దివ్యమంగళవిగ్రహ సౌందర్యాన్ని ఆళ్వార్లు విస్తృతంగా ఏడు పాశురాలలో అనుభవించేటట్లుగా వారు ఇహలోకంలో ఉన్నప్పుడే భగవానుడు ఒక మానసిక దశావిశేషాన్ని కలుగజేయగా, ఆళ్వార్లు ఆ కల్యాణగుణానుభవాన్ని, రూపసౌందర్యాన్ని అనుభవించి ఆనందించిన రీతిని తిరువాశిరియంలో అవిష్క రించారు. శ్రీరాముడు చిత్రకూటంలో ఉన్నాడని విని **"ఏభి శ్చ సచివై స్సార్ధమ్"** అనే రీతిలో తనతోపాటు వశిష్టాది మహర్షులను, తల్లులను వెంటబెట్టుకొని, "ఒకరి కన్నీరు అయినా సహించలేనివాడు ఇంతమంది కంట నీరును చూచి సహించగలదా? నా మాటను కాదనకుండా నన్ను తప్పక అనుగ్రహిస్తాడు"- అని ఆశపడి భరతుడు సమాశ్వాసాన్ని పొందిన దశతో ఇది పోలి ఉన్నది.

తిరువాశిరియప్రబంధంలో తాము అనుభవించిన భగవద్విషయంలో అవిచ్ఛిన్నంగా, ఆ విషయానికి అనురూపంగా తమ ఆశ కట్టలు తెంచుకొని వృద్ధి చెందిన వైనాన్ని ఆZ్వార్లు పెరియతిరువన్దాదిలో తెలిపారు. శ్రీనందిగ్రామంలో వేచి ఉండి, పద్నాలుగు ఏండ్ల తరువాత శ్రీరాముడు తిరిగి వస్తాడు అని **"రామాగమన కాంక్షయా"** అనే రీతిలో పద్నాల్గు ఏండ్లు ఆశను అపరిమితంగా పెంచుకొన్న భరతుని దశతో ఇది పోలి ఉన్నది.

అజీర్ణరోగాన్ని నయం చేసి, ఆకలిని పెంచి, ఆ తరువాత అన్నం పెట్టే రీతిలో, తమకు కైంకర్యరుచిని కల్గించిన రీతిని, ఆ రుచి పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులుగా పండిన రీతిని, తరువాత ప్రకృతిసంబంధం తీరి తాము ఆశించిన ప్రయోజనాన్ని పొందిన రీతిని ఆZ్వార్లు చివరి ప్రబంధం అయిన తిరువాయ్‌మొZిలో వ్యక్తం చేశారు. ఇది, శ్రీరాముడు రావణవధానంతరం అయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషేకాన్ని చేసికోగా, భరతుడు స్వరూపానురూపం అయిన కైంకర్యాన్ని చేసి ఆనందించిన రీతిని పోలి ఉన్నది.

నమ్పిళ్ళై ఈ విధమైన వివరణాన్నే "తీర్ప్పారై యామిని" (4-6) అనే దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహిస్తూ తెలియజేయడం గమనార్హం అచటి వ్యాఖ్యానసూక్తి సహృదయ రంజనార్థం ఉట్టంకింపబడుతున్నవి.

**"పొయ్‌న్నిన్ఱ ఞానత్తిలే ప్రకృతిదోషత్తై అనుసంధిత్తు, శ్రీభరతాZ్వాన్, "పెరుమాళ్ అభిషేకత్తుక్కు నమ్మై యŽత్తు వన్దతు" ఎన్ఱు అవరై త్తిరుముడిశూట్టి అడిమైశెయ్యక్కడ నోమ్" ఎన్ఱు పారిత్తు వర క్కొణ్డు కైకేయి" రాజన్ "ఎన్ఱు ఉనక్కు ముడి వాజ్గి వైత్తేన్ ఎన్ఱపోతు అవన్ తుడిత్తాప్పోలే తుడిత్తారాయి ƒ\ు. "నాన్ అవరడియేనన్ఱో! అవర్ ఎన్ శొల్లై మఱుప్పరో? ఇప్పోతే మీట్టుక్కొణ్డు వన్దు తిరువభిషేకమ్ పణ్ణుకిఱేన్" ఎన్ఱు తిరుచ్చిత్తిర కూడత్తిలే కిట్టుమళవుమ్ పిఱన్ద తరిప్పుప్పోలే యాయి ƒ\ు- తిరువాశిరి యత్తి పిఱన్ద తరిప్పు. పిన్బు, పదినాలాణ్డుకూడి ఆశై వళర్న్దాప్పోలే యాయి ƒ\ు తిరువన్దాదియిల్ ఆశై పెరుకినపడి. "ఎనైజ్ఞానార్ తామే యణుక్కరాయ్ శార్న్దొŽన్దార్", "ముయ ƒ\ి శుమన్దెZన్దు" ఎన్నుమ్బడియిఱే ఆశై పెరుకినపడి. మీణ్డుఎZన్దరుళి తిరువభిషేకమ్ పణ్ణి అవన్ మనోరథమ్ తలైక్కట్టినాప్పోలే యాయి ƒ\ు- తిరువాయ్ మొŽయిల్ ఇవరై అనుభవిప్పిత్తవడి".**

ఈ పంక్తులు మూన్ఱామ్ శ్రియఃపతిలోని సూక్తులతో సర్వథా పోలి ఉండడాన్ని గమనించవచ్చు. ప్రబంధవ్యాఖ్యానం మధ్యలో ఈవిధంగా నమ్మాZ్వార్ల నాల్గు

ప్రబంధాలలోని ప్రమేయాల సమన్వయాన్నిగూర్చిన ప్రసక్తి ఏవిధంగా వచ్చిందనే సందేహాన్ని అరుంబదకారులు తీరుస్తూ, ఈ దశకం కాలక్షేపం జరుగుతూ ఉన్నప్పుడు మధ్యలో కొందరు శ్రీవైష్ణవులు రాగా వారికోసం నమ్పిళ్ళై ఈ వివరణాన్ని తెలిపారని అన్నారు. శుద్ధసత్త్వమ్ అణ్ణన్ అనే ఆచార్యులు పెరియప్పై అనే తమ శిష్యులకు ఈ వివరణాన్ని తెలుపుతూ - **"ఉమక్కాకత్తాన్ పిళ్ళై యిప్పడి ప్రబంధతాత్పర్యోపన్యాసమ్ శెయ్‌దరుళినార్"** అని రస్యంగా అన్నారనే ఐతిహ్యంకూడా అక్కడ అరుంబదంలో ఉట్టంకింపబడింది.

## ద్రావిడసాహిత్యంలో ఆశిరియ ఛందో వైలక్షణ్యం

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాశిరియ ప్రబంధానికి ఈ పేరు ఇందులోని పాశురాల ఛందస్సునుబట్టి వచ్చింది. ఈ ప్రబంధంలోని పాశురాలు **"ఆశిరియప్పా"** అనే ఛందస్సులో కూర్పబడ్డాయి. **"ఆశిరియ ప్పావదనాల్ అరుమఱైనూల్ విరిత్తానై"** అనే ఈ ప్రబంధతనియన్‌సూక్తి ప్రకారం ఆశిరియప్పా అనే ఛందఃప్రకారంలో కూర్పబడ్డాయి కదా! ద్రావిడభాషలోని నాల్గు విధాలైన ఛందస్సులలో ఆశిరియప్పా ఒకటి. **ఆశిరియప్పా, వెణ్బా, కలిప్పా, వఞ్జిప్పా** - అనేవి నాల్గు ద్రావిడఛందో రీతులు. **"ఆశిరియమ్ వఞ్జివెణ్బా వలి యెన నాలియ ఱ్ఱెన్బ పావకైవిరియే"** అని తొల్‌కాప్పియ సూక్తి. తొల్‌కాప్పియం ఈ నాల్గు ప్రకారాలను ఆశిరియప్పా, వెణ్బా అనే రెండిటిలో అంతర్భవింపజేసి పల్కింది. కాని, తరువాతి కాలానికి చెందిన వ్యాఖ్యాతలు ఈ విధమైన అంతర్భావాన్ని అంగీకరించలేదు. నేరిశై, ఇణైక్కుఱళ్, అడిమఱిమణ్డిలమ్, నిలైమణ్డిలమ్ - అనే నాల్గు ఆశిరియప్పా ప్రకారాలను తరువాతి కాలంలోని తొల్ కాప్పియవ్యాఖ్యాతలు, లక్షణకారులు తెలిపారు. ఈ విభాగాలనుగూర్చిన ప్రసక్తి తొల్‌కాప్పియంలో లేదు. **"అకవల్ ఎన్బతు ఆశిరియమ్"** అని అంటూ తొలికాప్పియం **"అకవల్"** అనే పేరుతోకూడా ఆశిరియప్పాను వ్యవహరించింది. **"ఆశిరియమ్"** అనే పేరు ఛందస్సునుబట్టి, **"అకవల్"** అనే పేరు ధ్వనినిబట్టి వచ్చింది.

## ఆశిరియప్పా ప్రాచీనమైనది

పూర్వం ప్రస్తావించిన నాల్గు విధాలైన ద్రావిడ ఛందోరీతులలో ఆశిరియప్పా చాలా ప్రాచీనమైనది. సహజమైనది, రచనలో ఏ క్లేశం లేనిది. పాట్టు, త్తొకై - అని విభాగం చేసి వ్యవహరింపబడే ప్రాచీనద్రావిడ లక్ష్యసాహిత్యంలో ఎక్కువ సంఖ్యలో గ్రంథాలు ఈ ఛందస్సులోనే రచింపబడ్డాయి. **"కలి, పరిపాడల్"** తప్ప మిగిలిన

ఎట్టుత్తొకైలో ఉండే అన్ని కృతులు, పత్తుప్పాట్టు పూర్తిగా ఆశిరియప్పా ఛందస్సులో రచింపబడినవే. శిలప్పదికారంలోని ముప్పై గాథలలో ఇరవై నాల్గు గాథలు ఈ ఛందస్సులోనే ఉన్నాయి. మణిమేకలై, పెరుఙ్కతై ఆశిరియప్పాలోనే రచింపబడ్డాయి. దీనినిబట్టి ఈ ఛందస్సు యొక్క ప్రాచీనత, పూర్వం ఇది విరివిగా ఉపయోగింపబడడం తెలుస్తున్నవి. ఈ విధంగా కన్పించే దీని ప్రయోగప్రాచుర్యాన్నిబట్టి, సౌకర్యాన్నిబట్టి తొల్‌కాప్పియకారుడు నాల్గు విధాలైన ద్రావిడ ఛందస్సులలో దీనికే ప్రథమస్థానాన్ని ఇచ్చాడు. తొల్‌కాప్పియకాలంలోను, అంతకుముందు కాలంలోను ఈ ఛందస్సు మిక్కిలి ప్రాచుర్యాన్ని, ప్రశస్తిని పొందిందని దీనివల్ల స్పష్టమవుతున్నది.

## భక్తిసాహిత్యంలో ఆశిరియప్పా

ఈ విధంగా ద్రావిడ సాహిత్యంలో అనాదిగా ఉపయోగంలో ఉండే ఈ ఛందో రీతిని భక్తికవులు తమ భక్తికావ్యాల రచనలో ప్రచురంగా ప్రయోగించారు. ఈ ఛందస్సులో కృతుల పేరును పెట్టారు. శైవసాహిత్యానికి చెందిన తిరుముఱై సాహిత్యంలో 95 ఆశిరియప్పా ఛందస్సులో పాశురాలు కన్పడుతున్నాయని ద్రావిడ సాహిత్య పరిశోధకులు శ్రీమాన్ కందసామి తెలిపారు. శ్రీవైష్ణవసాహిత్యంలోకూడా నమ్మాళ్వార్లు తిరువాశిరియ ప్రబంధాన్ని, తిరుమఙ్గైయాళ్వార్లు తిరువెழుకూఱ్ఱిరుక్కై ప్రబంధాన్ని ఈ ఛందస్సు లోనే రచించారు. సంఘసాహిత్యానికి చెందిన నఱ్ఱిణై, కుఱున్తొకై, ఐఙ్కుఱునూఱు, అకనానూఱు, పుఱనానూఱు, పెరున్తేవనార్‌కడవుళ్ రచించిన భారతం- అన్నీ ఈ ఛందస్సులో కూర్పబడ్డవే. ఈ కాలంనుండి పలువురు ద్రావిడకవులు తమ భక్తికృతులను ఎక్కువగా ఈ ఛందస్సులో రచించారు.

**నమ్మాళ్వార్ల తిరువాశిరియమ్ ఛందస్సు పేరుతో వ్యవహరింపబడ్డ మొదటి కృతి :-** నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాశిరియ ప్రబంధం. ఆశిరియ ఛందస్సులో రచింపబడి, ఆ ఛందస్సు పేరుతో వ్యవహరింపబడిన మొట్టమొదటి కృతి. శైవ సాహిత్యానికి చెందిన తిరుముఱైలో పదకొండవ తిరుముఱైలోను, తిరువాల వాయుడై యార్‌చే రచింపబడ్డ తిరుముకప్పాశురమ్, నక్కీరన్ రచించిన షెరున్తేవపాణి మొదలైనవి ఈ ఛందస్సులో రచింపబడినా ఛందస్సుపేరుతో అవి వ్యవహరింపబడడంలేదు. ఎనిమిదవ తిరుముఱైలోకి చేరిన, మాణిక్కవాచకర్ రచించిన **"కీర్‌త్తి త్తిరువకవల్", "పోఱ్ఱి త్తిరువకవల్"** మొదలైనవి ఆశిరియప్పా ఛందస్సులో రచింపబడి, ఆ ఛందస్సు పేరుతో వ్యవహరింపబడుతున్నా అవి నమ్మాళ్వార్ల కాలానికి తరువాత రచింపబడినది.

**తిరువాశిరియ ప్రబంధంలోని ఆశిరియప్పా సన్నివేశం:**

నమ్మాళ్వార్ల తిరువాశిరియంలోని ఏడు పాశురాలు ఆశిరియఛందస్సులో అన్దాది రీతిలో రచింపబడ్డాయి. అయితే ఇది మండల అన్దాదికాదు. 1, 2, 3, 4 అనే నాల్గు పాశురాలు లోని అన్ని పాదాలు నిడివి కల్గి ఉంటాయి. కనుక ఇవి నిలైమణ్డిల ఆశిరియప్పా విభాగానికి చెందినవి. 5వ పాశురం, 7వ పాశురం నేరిశై ఆశిరియప్పా రీతికి చెందినవి. 6వ పాశురంలోని 5వ పాదం చిన్నది. శిన్దడి (మూడు గణాలను కల పాదం). మిగిలిన పాదాలు అన్నీ నిడివిని కల్గి ఉన్నా ఒక పాదం కుఱుచగా ఉన్నందువల్ల ఈ పాశురం ఇణైక్కుఱళ్ ఆశిరియప్పాగా చెప్పబడుతున్నది.

ఈ ప్రబంధం మండల అన్దాదిగా కన్పించనందువల్ల, నమ్మాళ్వార్ల మిగిలిన మూడు ప్రబంధాలు మండల అన్దాదులుగా ఉన్నందువల్ల ఈ ప్రబంధం కూడా మండల అందాదియే అని, దీనిలో ఇంకా కొన్ని పాశురాలు ఉండి ఉండాలని, అవి కాలక్రమేణ లోపించాయని కొందఱు వాదిస్తున్నారు. కాని, ఈ వాదాన్ని **మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు** తమ దివ్యార్థదీపికవ్యాఖ్యలో తిరస్కరిస్తూ సహేతుకంగా బదులిచ్చారు. (చూ. దివ్యార్థ దీపిక - అవతారిక). అంతేకాక, ఈ ప్రబంధం ఏడు పాశురాలను కల్గి ఉండడాన్నిబట్టి, దీనికి మూలభూతమైన యజుర్వేదంలో ఏడు కాండలుండడంబట్టి కూడా - ఈ వాదాన్ని తిరస్కరించవచ్చు.

**శైవసాహిత్యంలోని "తిరువా ్రియూర్ ఒరుపా ఒరుప.్.తు- నమ్మాళ్వార్ల తిరువాశిరియం :** ద్రావిడవాఙ్మయంలోని శైవసాహిత్యానికి చెందిన తిరుముఱైలో 11వ తిరుముఱైలో గల **"తిరువా ్రియూర్ ఒరుపా ఒరు ప.్.తు"** అనే కృతి ఇంచుమించు నమ్మాళ్వార్ల తిరువాశిరియాన్ని పోలి ఉంటుంది. పాశురసంఖ్యలో, పేరులో వ్యత్యాసం తప్ప, మిగిలిన అంశాలన్నీ ఈ రెండిటి మధ్య సమానాలే. **"తిరువా ్రియూర్ ఒరుపా ఒరువ.్.తు"**లో పది పాశురాలున్నాయి. ఇవి ఆశిరియప్పా ఛందస్సులో అన్దాది ప్రక్రియలో కూర్పబడ్డాయి. ఒకే ఆశిరియ ఛందస్సులో రచింపబడ్డ ఈ రెండు కృతులలో నమ్మాళ్వార్ల కృతి **"తిరువాశిరియమ్"** అని, ఇంకొకటి **"ఒరుపా ఒరుప.్.తు"** అని పిలువ బడుతున్నాయి. నమ్మాళ్వార్ల కృతికి పేరు ఛందస్సునుబట్టి రాగా, రెండవ కృతికి పేరు అది కీర్తించే దివ్యక్షేత్రంపేరునుబట్టి **(తిరువా ్రియూర్)**, ఛందోరీతినిబట్టి **(ఆశిరియప్పా** అనే ఒకే ఛందస్సు), పాటల సంఖ్యనుబట్టి **(ఒరు పత్తు)** వచ్చింది. ఒకే ఛందస్సులో రచింపబడ్డ ఈ రెండు కృతులను వేర్వేరుగా గుర్తించడంకోసమై ఈ నామభేదం ఏర్పడి ఉండవచ్చు.

**నమ్మాళ్వార్ల అనంతరకాలంలో ఆశిరియచ్ఛందస్సు :-** తరువాతి కాలంలో ఆశిరియప్పా ఛ్ఛందస్సులో రచింపబడ్డ పలు కృతులు ఛందస్సు పేరుతో వ్యవహరింప బడేవి ఉన్నాయి. మాణిక్కవాచకర్ **"కీర్త్తి త్తిరువకవల్", "పో ౯ ౧త్తిరువ కవల్"** అనే కృతులను, మూడు పట్టినత్తార్ **"కోయి ౯ ౧రువకవల్"**ను, **"కచ్చి త్తిరువకవల్"**ను రచించారు.

వళ్ళలార్ అనే తమిళ్ కవి రచించిన **"అరుట్పెరుఞ్జోతి యకవల్"** కూడ ఇటువంటిదే. ఇందులో ఆశిరియప్పా ఛందస్సులో రచింపబడ్డ 1596 పాదాలు ఉండడం విశేషం. తొల్‌కాప్పియ రచనా కాలానికే ఆశిరియఛందస్సు **'అకవల్'** అనే పేరుతోకూడా వ్యవహరింపబడి నట్లు తెలుస్తున్నది. **"తిరువరుట్పా"** అనే శైవసాహిత్యకృతిలో- **"దేవ ఆశిరియమ్"** అనే పేరుతో ఒక విభాగం ఉన్నది. అందులో ఉండే మూడు పాశురాలు అఱు శీర్ ఆశిరియ విరుత్తమ్ అనే ఛందస్సులో రచింపబడ్డాయి. కృతికర్త అయిన వళ్ళలార్ దానికి **"దేవ ఆశిరియమ్"** అనే పేరు పెట్టడానికి కారణం- **"తిరువాశిరియమ్"** కంటే పేరులో వైలక్షణ్యాన్ని సూచించడం కోసమే కావచ్చు. ఈ రీతిగా చూస్తే, ఆశిరియమనే పేరు నాల్గు విధాలైన ఛందోలక్షణరీతులలో ఒకటి అయిన ఆశిరియానికే కాక, లక్ష్య గ్రంథప్రకారానికి కూడా ఉన్నదని తెలుస్తున్నది. నవీన ద్రావిడసాహిత్యంలో ఈ విధంగా ఛందస్సునుబట్టి కృతుల నామకరణం చేయడం ఎక్కువగా కానరాదు.

**తిరువాశిరియంలో భగవానుని త్రివిధకారణత్వ ప్రసక్తి :-** లోకంలో కార్యాన్ని ఉత్పాదన చేసే కారణాలు- నిమిత్త, ఉపాదాన, సహకారి రూపాలలో మూడుగా ఉంటాయి. ఘటానికి కుమ్మరి నిమిత్తకారణం, మట్టి ఉపాదానకారణం, దండచక్రాదులు సహకారి కారణాలు. కాని, జగద్రూపమైన కార్యోత్పత్తికి పరమాత్మే ఈ మూడు కారణాలు. నిమిత్త కారణం అనేది కార్యరూపంగా వికారాన్ని పొందించే కర్తృరూపమైన వస్తువు. ఉపాదానకారణం - కార్యరూపంగా వికారాన్ని పొందే వస్తువు. సహకారికారణం - కార్యరూపంగా మారడంలో ఉపకరణంగా ఉండే వస్తువు. బ్రహ్మ ఈ జగత్తులో ఈ మూడు విధాలైన కారణాలు అవుతున్నాడని అంటే, సూక్ష్మ చిదచిద్విశిష్టవేషంతో ఉపాదానకారణంగాను, సంకల్పవిశిష్టవేషంతో నిమిత్తకారణం గాను, జ్ఞానశక్త్యాది విశిష్టవేషంతో సహకారి కారణంగాను అవుతున్నాడు. శ్రుతికూడా ఈ కారణత్రయాన్ని **"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్"** అనే ఛాందోగ్యవాక్యంద్వారా తెలిపింధి. ఇక్కడ ఒక విషయం గమనించవలసి ఉన్నది. **"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్ ఏక మేవాద్వితీయమ్... ఇతి ఏకస్యైవ సచ్ఛబ్దవాచ్యస్య నిమిత్తోపాదానరూపకారణత్వేన"**

అని అంటూ శ్రీభాష్యంలో ఈ శ్రుతిలో నిమిత్త, ఉపాదానరూప కారణద్వయం చెప్పబడిందని తెలుపబడింది. **"ఏక మేవ"** అని ఉపాదాన కారణం, **"అద్వితీయ మేవ"** అని నిమిత్తకారణం చెప్పబడిందనే విషయం **"తదపి సదేవేదమగ్ర ఏక ఏవాసీదిత్యుపాదానతాం ప్రతిపాద్య", "అద్వితీయ మిత్యధిష్ఠాత్రంతరం ప్రతిషిధ్య"** ఇత్యాది శ్రీభాష్యసూక్తులద్వారా తెలుస్తున్నది. అందువల్ల **"సదేవ"** ఇత్యాది శ్రుతిలో కారణత్రయాన్ని చెప్పడం ఏవిధంగా తగినది? అనే ప్రశ్న ఇక్కడ కలుగవచ్చు. అయితే ఈ శ్రుతివాక్యంలో **"సదేవ"** అని సహకారికారణం, **"ఏక మేవ"** అని ఉపాదాన కారణం, **"అద్వితీయమ్"** అని నిమిత్తకారణం చెప్పబడిందనే నిర్వాహాంతరంకూడా ఒకటి ఉన్నది. నమ్మాழ்వార్ల తిరువాశిరియంలోని **"ఇరుమ్ పొరుట్కెల్లామ్ అరుమ్ పెఱల్ తనివిత్తు ఒరుతానాకి"** అనే సూక్తిలోని **"విత్తు"** అనే పదం ఉపాదానకారణాన్ని, **"తని"** అనే పదం నిమిత్తకారణాన్ని, **"ఒరు"** అనే పదం సహకారికారణాన్ని తెలుపుతున్నది. అదే రీతిలో, తిరువాయిమొழிలోని- **"తానోరు రువే తని విత్తాయ్"** (1-5-4) అనే సూక్తిలో **"విత్తాయ్"** అనే పదంద్వారా ఉపాదాన కారణాన్ని, **"తని ఆయ్"** అని నిమిత్తకారణాన్ని, **"ఓర్ ఆయ్"** అని సహకారికారణాన్ని తెల్పుతున్నవి- అని పూర్వాచార్యుల నిర్వాహం. విశేషమేమంటే- ఈ నిర్వాహం నఙ్జీయర్ ఒన్బదినాయిరప్పడిలో, పెరియవాచ్చాన్పిళ్ళై ఇరుపత్తు నాలాయిరప్పడిలో, ఈడు ముప్పత్తాఱాయిరప్పడిలో, పన్నీరాయిరప్పడిలో స్పష్టంగా తెలుపబడింది. పెరియ వాచ్చాన్పిళ్ళై ఇరుపత్తునాలాయిరప్పడిలో - **"విత్తాయ్- ఎన్ఱు ఉపాదానమ్ శొల్లి క్కు, తనివిత్తాయ్- ఎన్ఱు నిమిత్తాన్తరనిషేధమ్ పణ్ణి క్కు, ఓర్ తని విత్తాయ్ - ఎన్ఱు సహకార్యంతర నిషేధమ్బణ్ణి క్కు. సదేవ, ఏకమేవ, అద్వితీయమ్- ఎన్గిఱ శ్రుతిచ్ఛాయైయాలే అరుళిచ్చెయ్‌కిఱార్"** అని తెలుపడడం గమనించవచ్చు. ఈ తిరువాయ్‌మొழி సూక్తికి గల ఈడు వ్యాఖ్యను వివరించే అరుంబద వివరణంలో కూడా - **"భాష్యత్తిలే- ఏకమే వాద్వితీయమ్ ఎన్గిఱ పదద్వయత్తాలుమ్ ఉపాదాన నిమిత్తత్త్వమ్ శొన్నతు సహకారికారణత్వత్తుక్కు ముపలక్షణ మాక్కి, "సదేవ" ఎన్డతుక్కు అసద్వ్యావృత్తిపరమాక అరుళిచ్చెయ్‌దిరుక్క, ఈట్టుక్కారర్, "సదేవ" ఎన్డతుక్కు సహకారికారణపరమాక అరుళిచ్చెయ్‌కైయాలే, ఇతువు మొరు నిర్వాహ ముణ్డెన్ఱు కణ్డుకొళ్వతు"** అని తెలుపబడడం గమనార్హం. తిరుమழிశైయాழ்వార్లు కూడా తిరుచ్చన్ద విరుత్తంలో- **"ఆది యాది యాది నీ"** (34) అని పలుకగా, ఈ సూక్తిని పెరియవాచ్చాన్ పిళ్ళై **"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్ ఎన్గిఱపడియే త్రివిధ కారణముమ్ నీ"** అని వ్యాఖ్యానించడం గమనించవచ్చు. ఈ విధంగా పరమాత్మయొక్క త్రివిధ కారణత్వం దివ్యసూరి సూక్త్యభిమతం, అభిజ్ఞులైన పూర్వాచార్యులకు సంమతం.

ఇటువంటి గంభీరాలైన వేదాంతార్థాలు అనేకం ఈ ప్రబంధంలో అడుగడుగునా గోచరిస్తాయి. విస్తరభయంచేత ప్రస్తావించడం లేదు.

కేవలం ఏడు పాశురాలను కల్గి ఆకారంలో చిన్నది అయినా **"అరుమఱై నూల్"** అనే రీతిలో అరుదైన వేదాంతార్థాలను ప్రకాశింపజేసే ఈ తిరువాశిరియప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై అన్యూనాతిరిక్తమైన, రస్యరహస్యార్థబంధురమైన వ్యాఖ్యను అనుగ్రహించారు. అర్వాచీనకాలంలో కూర్చిన అరుంబదవివరణంకూడా ఒకటి ఉన్నది. ఈ అరుమ్బదం పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి చెందినది కాకపోవడం గమనార్హం. అందువల్ల ఈ ప్రబంధానికి ఇంతకు పూర్వం వేఱొక వ్యాఖ్యానం రచింపబడిందని, దాని వివరణంగానే ఈ అరుమ్బదం రచింపబడిందని ఊహించవచ్చు. ఈ రెండు సుమారు 100 సం॥లకు ముందు తెలుగు లిపిలో, ద్రావిడ లిపిలో ముద్రింపబడ్డాయి. కాని, అవి ఇపుడు సులభంగా లభ్యం కావు. అందువల్ల ప్రకృతం ఈ ప్రబంధాన్ని పునర్ముద్రించడం అత్యంతం ఆవశ్యకం. గత శతాబ్దిలో ఆసేతుహిమాచలం భగవద్రామానుజసిద్ధాంతాన్ని అనితరసాధారణంగా ప్రచారం చేసిన మహనీయులు, త్రిసంధ్యస్మరణీయ వైభవులు **కాంచీ మహావిద్వాన్ ప్రభ అణ్ణంగరాచార్యస్వామివారు** ద్రావిడంలో సంతరించిన, విశేషార్థాలతో కూడిన **దివ్యార్థదీపికా** వ్యాఖ్య కూడా ఉన్నది. ఆ వ్యాఖ్యకూడా ఆంధ్రానువాదసహితంగా సంప్రదాయజ్ఞులైన సాహిత్యరసికుల ఆమోదంకోసం ప్రచురింపబడుతున్నది. ఈ దివ్యార్థదీపికావ్యాఖ్యను ముద్రించ డానికి అనుమతించిన **ఉ.వే. శ్రీమాన్ ప్ర.భ. రాజహంసం స్వామివారికి,** వారి కుటుంబ సభ్యులకు అనేక ధన్యవాదాలు. పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యకు శ్రీసుదర్శన తమిళమాస పత్రిక సంపాదకులు, **శ్రీవైష్ణవసింహ, ఉ.వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు** రచించి ముద్రించిన ద్రావిడభాషా వివరణాన్ని కృతజ్ఞతా పూర్వకంగా అనుసరిస్తూ ప్రకృత భావదీపికావ్యాఖ్య రచింపబడింది. ఆశిరియప్పాకు సంబంధించిన పలు విశేషాలు **శ్రీమాన్ ప్రొ. ఎం.పి. శ్రీనివాసన్ గారి "తమిழ் ఇలక్కణ వరలాఱు"** అనే తమిళగ్రంథం నుండి కృతజ్ఞతా పూర్వకంగా స్వీకరింపబడ్డాయి.

ఈ గ్రంథ ముద్రణకు ఆవశ్యకమైన ఆర్థికసాహాయ్యాన్ని అందించడానికి ముందుకు వచ్చిన **"శ్రీరామానుజసిద్ధాంత సభ, సికింద్రాబాద్"** వారికి కృతజ్ఞతలు. అందుకు ఆ సంస్థను ప్రోత్సహించిన సహృదయులు, **ఉ.వే. శ్రీమాన్ కె.కె. పరకాలన్ స్వామివారి సన్నిధిలో,** ఉ.వే. **శ్రీమాన్ రాఘవన్‌స్వామివారి** సన్నిధిలో కార్తజ్ఞ్యపురస్సరంగా ప్రణమిల్లుతున్నాను. భగవద్భాగవతాచార్య కైంకర్య నిష్ఠులు **శ్రీమాన్ స్వామిదాస్‌గారికి**

అనేక ధన్యవాదాలను అర్పించుకొంటున్నాను. ప్రార్థించిన వెంటనే కాదనకుండా తమ అమూల్యమైన మంగళాశాసనాలను అనుగ్రహించిన **శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంతప్రవర్తకులైన, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులైన తిరుమల తిరుపతి, తిన్ననూరు దేవస్థానములకు ధర్మకర్తలైన పెరియ కోవిల్ కేళ్వి అప్పన్ శ్రీ శఠకోపరామానుజ జీయర్‌స్వామివారి** దివ్యసన్నిధిలో సవినయంగా, భక్తిపూర్వకంగా నమస్సుమాంజలులను సమర్పించుకొంటున్నాను. ఈ ప్రయత్నంలో నన్ను అన్నివిధాలుగా ప్రోత్సహించి, మార్గదర్శనం చేసిన పితృపాదులు, **న్యాయవేదాంత విద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి** సన్నిధిలో సవినయంగా ప్రణమిల్లుతున్నాను. ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసి సహకరించిన **శ్రీమతి జయలక్ష్మిగారికి, శ్రీచంద్రశేఖర్‌గారికి,** అందంగా ముద్రించిన **సి.ఎన్. ప్రింటర్స్ హర్షవర్ధన్‌గారికి** కృతజ్ఞతలు. సహృదయులైన, గుణగ్రాహులైన ఆస్తికులు ఈ గ్రంథాన్ని ఆదరించి, ఆశీర్వదిస్తారని భావిస్తున్నాను. స్వస్తి.

**తిరువాశిరియాభిఖ్యం శఠజిత్‌కల్పకఫలం సుధామధురమ్ ।**
**తత్త్వం యజుషాం నిర్మలచిత్తై రుపభుజ్యతాం విబుధైః ॥**

**శ్రీకృష్ణసూరిగురుణా ప్రోక్తాం వ్యాఖ్యాం గభీరహృద్యార్థామ్ ।**
**మనసా విభావ్య క్రియతే వ్యాఖ్యా దాసేన శింగరార్యేణ ॥**

ఇట్లు నివేదించు
భాగవతవిధేయుడు

తిరుపతి

3-1-2011

**ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీమతే రామానుజాయ నమః



నమ్మాZ్వార్లు అనుగ్రహించిన

# తిరువాశిరియమ్

అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన తనియన్

కాశినియోర్ తామ్ వాZ క్కలియుకత్తే వన్దుదిత్తు
ఆశిరియప్పావతనాల్ అరుమఱైనూల్ విరిత్తానై
త్తేశికనై ప్పరాఙ్గుశనై త్తికZ్ వకుళత్తారానై
మాశడైయా మనత్తు వైత్తు మఱవామల్ వాZ్త్తుతుమే.



1. శెక్కర్ మాముకిలుడుత్తు మిక్క శెఙ్జుడర్
ప్పరితి శూడి, అఙ్జుడర్ మతియుమ్ పూణ్డు
పల శుడర్ పునైన్దు పవళచ్చెవ్వాయ్,
తికZ్ పశుమ్ శోతి మరతకక్కున్ఱమ్,
కడలోన్ కైమిశై క్కణ్ వళర్వతుపోల్
పీతకవాడై ముడి పూణ్ ముతలా,
మేతకు పల్ కలనణిన్దు, శోతి
వాయవుమ్ కణ్ణవుమ్ శివప్ప, మీతిట్టు
ప్పచ్చై మేని మిక ప్పకైప్ప,
నచ్చు వినైక్కర్తలై యరవినమళి యేఱి,

ఎఱికడల్ నడువుళ్ అఱితుయిలమర్న్దు,
శివనయనిన్దిరనివర్ ముతలనైత్తోర్,
తెయ్వక్కZాజ్గళ్ కై తొZ క్కిడన్ద
తామరైయున్ది తని ప్పెరు నాయక,
మూవులకళన్ద శేవడియోయే.

2. ఉలకుపడైత్తుణ్డ ఎన్దై, అఱైకZల్
శుడర్ ప్పూన్దామరై శూడుతఱ్కు, అవావు ఆ
రుయిరురుగి యుక్క, నేరియ కాత
లన్బిలిన్బీన్ తేఱల్, అముత
వెళ్ళత్తానామ్ శిఱప్పు విట్టు, ఒరు పొరుట్కు
అశైవోర్ అశైక, తిరువొడు మరువియ
ఇయఱ్కై, మాయాప్పెరువిఱల్ ఉలకమ్
మూన్ఱినొడు నల్వీడు పెఱినుమ్,
కొళ్వతెణ్ణుమో తెళ్ళియోర్ కుఱిప్పే,

3. కుఱిప్పిల్ కొణ్డు నెఱిప్పడ, ఉలకమ్
మూన్ఱుడన్ వణఙ్గు తోన్ఱు పుకZ్, ఆణై
మెయ్పెఱ నడాయ తెయ్వమ్ మూవరిల్
ముతల్వనాకి, శుడర్విళఙ్గకలత్తు,
వరైపురై తిరైపొరుపెరువరై వెరువుఱ,
ఉరుమురలొలిమలి నళిర్కడఱ్పడవర
వరశు, ఉడల్ తడవరై శుZ(్)(్)య, తనిమా
త్తెయ్వత్తడియవర్క్కు ఇని నామ్ ఆళాకవే
ఇశైయుఙ్గొల్, ఊZితోఱూZి యోవాతే

4. ఊZతోఊZ ఓవాతు, వాZయ
వెన్డు యామ్ తౌZ ఇశైయుజ్గోల్,
యావకై యులకముమ్ యావరు మిల్లా,
మేల్వరుమ్పెరుమ్ పాZకాలత్తు, ఇరుమ్బొరు-
ట్కెల్లా మరుమ్బొఅల్ తనివిత్తు, ఒరుతా
నాకి త్తెయ్వనామ్మెక కొZముళై
యీన్డు, ముక్కణీశ నొడు తేవుపలనుతలి
మూవులకమ్ విళైత్త ఉన్ది,
మాయక్కడవుళ్ మాముతలడియే,

5. మాముతలడిప్పోతొన్డు కవిZత్తలర్త్తి,
మణ్ముZతు మకప్పదుత్తు, ఒణ్ శుడరడిప్పోతు
ఒన్డు విణ్ శెలీఇ, నాన్మెకప్పుత్తేళ్
నాడు వియన్దువప్ప, వానవర్ ముఱై ముఱై
వZపడ నెఱీఇ, తామరైక్కాడు
మలర్క్కణ్డొడు కనివాయుడైయతు
మాయ్, ఇరు నాయిఱు ఆయిరమ్ మలర్న్దన్న,
కఱ్పుకక్కావు పఱ్పలవన్న,
ముడితోళాయిరమ్ తZత్త.
నెడియోయ్క్కల్లతు అడియతో ఉలకే.

6. ఓ ఓ ఉలకినతియల్వే, ఈన్డోళిరుక్క
మణ నీరాట్టి, పడైత్తిడన్డు ఉణ్డుమిZన్దు
అళన్దు, తేర్న్దులకళిక్కుమ్ ముతప్పెరుమ్
కడవుళ్ నిఱ్ప, పుడై ప్పలతానఱి

తెయ్వమ్పేణుతల్, తనాతు
పుల్లటివాణ్మై పొరున్ద క్కాట్టి
కొల్వనముతలా అల్లన ముయలుమ్,
ఇనైయ శెయ్కై యిన్బ తున్బళి,
తొల్ మామాయ ప్పిఱవియుళ్ నీఙ్గా,
పల్ మామాయ త్తZన్దు మానళిర్ న్దే.

7. నళిర్మతి చ్చడైయనుమ్ నాన్ముకక్కడవుళుమ్,
తళిరొళి యిమైయవర్ తలైవనుమ్ ముతలా,
యావకై యులకముమ్ యావరు మకప్పడ,
నిలమ్ నీర్ తీకాల్ శుడరిరు విశుమ్బుమ్,
మలర్ శుడర్ పిఱవుమ్ శిఱితుడన్ మయఙ్గ,
ఒరుపొరుళ్ పుఱప్పాడిన్ఱి ముZవతుమ్
అకప్పడ క్కరన్దు, ఓరాలిలై చ్చేర్న్ద ఎమ్
పెరుమామాయనై యల్లతు,
ఒరు మాతెయ్వమ్ మ\\ఱ్డైయమో యామే.

అడిఅరవు - శెక్కర్ ఉలగు కుఱిప్పు ఊZ మాముతల్ ఓఓ ఉలగు నళిర్
ముయ\\ ి
ఆZ్వార్ తిరువడికళే శరణమ్,
తిరువాశిరియమ్ సంపూర్ణమ్.



శ్రీమతే రామానుజాయ నమః



నమ్మాళ్వార్లు అనుగ్రహించిన

# తిరువాశిరియమ్

అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన తనియన్

కాశినియోర్ తామ్ వాழ క్కలియుకత్తే వన్దుదిత్తు
ఆశిరియప్పావతనాల్ అరుమఱైనూల్ విరిత్తానై
త్తేశికనై ప్పరాఙ్కుశనై త్తికழ வకుళత్తారానై
మాశడైయా మనత్తు వైత్తు మఱవామల్ వాழత్తుతుమే.

కాశినియోర్తామ్ = ఈ భూమిలో ఉండే మానవులు, వాழ = తరించడం కోసం, కలి యుకత్తే = కలియుగంలో, వన్దు = (పరమపదంనుండి) వచ్చి, ఉదిత్తు = అవతరించి, ఆశిరియ ప్పా అదనాల్ = "ఆశిరియప్పా"- అనే ఛందస్సులో కూర్చిన పాశురాలతో, అరు మఱై నూల్ = గొప్ప వేదం అనే శాస్త్రాన్ని, విరిత్తానై = వివరించిన వారు, తేశికనై = (అందఱికీ) ఆచార్యులు, తికழ వకుళ త్తారానై = ప్రకాశించే వకుళమాలను అలంకరించుకొన్నవారు అయిన, పరాంకుశనై = నమ్మాళ్వార్లను, మాశు అడైయా = మాలిన్యం లేని, మనత్తు వైత్తు = మనస్సులో ప్రతిష్ఠింపజేసికొని, మఱ వామల్ = మఱవకుండా ఉండేటట్లు, వాழత్తుతుమే = మంగళాశాసనాన్ని చేస్తాము.

## శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానమ్

**అవతారికై :- (కాశినియోర్ తామ్ వాழ)** తిరువాశిరియ మాకిఱ దివ్యప్రబన్ధ దర్శియాయ్, దేశికరాయిరుక్కిఱవరై నిర్మలమాన హృదయత్తిలే వైత్తు విస్మృతియిన్ఱిక్కే నిరన్తరమఙ్గళాశాసనమ్ పణ్ణువో మెన్గిఱతు.

**వ్యా :- (కాశినియోర్ తామ్ వాழ)** కణ్డతుక్కుమేల్ ఒన్ఱు అఱియాత భూమి యిలుణ్డాన మనుష్యర్ ఉజ్జీవిక్క. **(కలియుకత్తే వన్దుతిత్తు)** 'కలౌ పునః పాపరతాభిభూతే

భక్తాత్మనా స ఉద్బభూవ” ఎన్గిఱపడియే జ్ఞానత్తుక్కు అడైవు ఇల్లాత కలికాలత్తిలే యుగవర్ణక్రమావతార మెన్నలామ్బడి ఆZవార్ అవతరిత్తరుళినారాయి₹\ు. (వన్దు తిత్తు) లోకాన్తరత్తిల్ నిన్ఱుమ్ ఇజ్గే వన్దు ఉతిత్తారెన్ఱుమతు తో₹\ుకిఱతు. “మున్నే వన్దుతిత్తు” ఎన్నుమాపోలే, “వకుళభూషణభాస్కరోదయ”మితే. మేలే “వకుళత్తారానై” ఎన్ఱితే యిరుక్కిఱతు.

అవతరిత్తు చ్చెయ్త కార్య మిన్నతు ఎన్గిఱతు మేల్- (ఆశిరియప్పావతనాల్ అరు మఱైనూల్ విరిత్తానై) ఎన్ఱు. తమిZుక్కు అనేకమ్ పాక్కళ్ ఉణ్డాయిరుక్కవుమ్ ఆశిరియప్పావాలేయాయి₹\ు తిరువాశిరియమ్ శెయ్తరుళినతు. అరుమఱైనూల్ విరిక్కైయావతు- అరియ వేదమాకిఱ శాస్త్రత్తై విస్తృతమాక్కి, అతువే నిరూపకమామ్బడి యానవరై. అరుమఱైనూలై “వణ్డమిZ నూలా” క్కినవరై. (తేశికనై ప్పరాజ్కుశనై) వేదార్థదర్శియాన పరాజ్కుశ దేశికనై. (తికZ వకుళత్తారానై) విళజ్గా నిఱ్కిఱ తిరుమకిZ మాలైయై త్తిరుమార్విలే యుడైయవరై. “తణ్డుళవత్తారానై” ఎన్నుమాపోలే. “తామమ్ తుళవో? వకుళమో!” ఎన్నక్కడవతితే.

(మాశడైయా మనత్తు వైత్తు) “మాశ₹\ార్ మనత్తుళానై” ఎన్ఱుమ్, “తెళిన్ద వెన్ శిన్దై యకమ్ కZియాతే” ఎన్ఱుమ్ నిర్మలమాన మనస్సిలే వైత్తు. “వణ్కురుకై క్కోనారుమ్ నమ్ముడై కుడి వీ₹\ిరున్దార్” ఎన్నుమ్బడి సహృదయమాక వైత్తు. పరమహంసరాకైయాలే మానసపద్మాసనత్తేయితే యిరుప్పతు. (వకుళత్తారానై మాశడైయా మవత్తు వైత్తు) “నాట్కమZ మకిZ మాలై మార్బినన్ మాఱన్ శడకోపన్” ఎన్నుమ్బడియాన ఆZ్వారై “శడకోపనై చ్చిన్దైయుళ్ళే పెయ్తఱ్కిశైయుమ్ పెరియవర్శీర్” ఎన్నుమ్బడి శుభాశ్రయమాక భావిత్తు భక్తి పణ్ణివైత్తు.

(మఱవామల్ వాZ్త్తుతుమ్) విస్మృతియిన్ఱిక్కే ఇవ్విరుప్పుక్కు నిరన్తరమ్ మజ్గళాశాసనమ్ పణ్ణువోమ్. అవరుమ్ “ఊZితోఱూZి యోవాతు వాZియ వెన్ఱు యామ్ తొZ విశైయుజ్గొల్” ఎన్ఱారితే. ఇత్తాల్- ఆZ్వార్దివ్యమజ్గళవిగ్రహమే శుభాశ్రయ మెన్నుమత్తైయుమ్, మజ్గళాశాసనవిషయ మెన్నుమత్తైయుమ్ శొల్లి₹\ాయి₹\ు.

తిరువాశిరియ త్తనియన్ వ్యాఖ్యానమ్ ము₹\ి₹\ు

పిళ్ళైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్



## శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం

**అవతారిక :-** ఈ తనియన్ పాశురాన్ని అనుగ్రహించిన మహనీయులు భగవద్రామానుజుల అంతరంగశిష్యులలో ఒకరైన అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్. వీరు శ్రీరామానుజులచేత పంచసంస్కారాలతో సంస్కరింపబడడానికి ముందు **"యజ్ఞమూర్తి"** అనే పేరును కల అద్వైతిగా ఉండేవారు. యజుర్వేదసారం అయిన తిరువాశిరియ ప్రబంధాన్ని దర్శించినవారు, ఆచార్యులు అయిన నమ్మాZ్వార్లను దోషరహితం అయిన మనస్సులో నిలుపుకొని, మఱవకుండా ఎల్లప్పుడూ మంగళా శాసనం చేద్దాం రండి!'' అని అందఱినీ ఈ ఆచార్యులు ఈ తనియన్ ద్వారా ఆహ్వానిస్తున్నారు.

వ్యాఖ్యానం :- **(కాశినియోర్తామ్ వాZ)**- ప్రత్యక్షంగా దర్శించడమే కాకుండా, ఏమీ తెలియని ఈ భూమిలోని సామాన్యమానవులు ఉజ్జీవించడంకోసం - అని భావం. **"కాశతే ఇతి కాశినీ"** (వ్యక్తంగా ప్రకాశిస్తున్నది కనుక **"కాశినీ"** అని భూమి అనబడుతున్నది) అనే వ్యుత్పత్తివల్ల **"కాశినీ"** అనే సంస్కృతపదం **"కాశిని"** అనే ద్రావిడ పదంగా మాఱి, వ్యక్తంగా కంటికి కన్పించే భూమిని తెల్పుతున్నది. **"కాశినియోర్"** అని అన్నందున **"కణ్డదే కాట్చి"** (కన్పించేదే సత్యం) అనే రీతిలో **"నేరే కణ్డదఱ్కు మేలే ఒన్ఱిల్లై"** (ప్రత్యక్షంగా చూచేదానికంటే వేఱే ఏమీ లేదు) అనే లోకాయత (చార్వాక) మతాన్ని అవలంబించేవారిని ఈ పదం సూచిస్తుంది. **"కలౌ పునః పాపరతాభిభూతే భక్తాత్మనా స ఉద్బభూవ"** (పాపం చేయడంలోనే ఆసక్తిని కల్గిన మానవులతో నిండిన ఈ కలియుగంలో ఆ భగవానుడు భక్తుల రూపంలో అవతరించాడు) అనేటట్లు జ్ఞానం లోపించిన కలియుగంలో "కృతయుగంలో దత్తాత్రేయుడుగా, పరశురాముడుగా బ్రాహ్మణవర్ణంలోను, త్రేతాయుగంలో చక్రవర్తి త్తిరుమకన్ (శ్రీరాముడు)గా క్షత్రియవర్ణంలోను, ద్వాపరయుగంలో రాజ్యపాలనార్హతను లేనివారైనందున వైశ్యుల వంటివారైన వసుదేవునకు, వైశ్యుడైన నందగోపునకు కుమారుడైన శ్రీకృష్ణుడుగా అవతరించిన భగవానుడే, నాల్గవ యుగం అయిన కలియుగంలో నాల్గవ వర్ణంలో జన్మించిన కారియార్కు, ఉడైయనఙ్గైకు కుమారుడైన నమ్మాZ్వార్లుగా అవతరించాడు కదా!'' అనే జ్ఞానులు భావించేటట్లు నమ్మాZ్వార్లు అవతరించారు.

**(వన్దుదిత్తు)** - నిత్యవిభూతి నుండి ఇక్కడకు వచ్చి అవతరించారు- అనే అర్థం స్ఫురిస్తున్నది. **"మ₹\ుళ్ళ ఆZ్వార్కళుక్కు మున్నే వన్దు ఉదిత్తు"** (మిగిలిన ఆZ్వార్లకు ముందుగా వచ్చి అవతరించి) **(ఉపదేశరత్తిన మాలై-7)** అని అంటూ

వరవరమునులు కూడా ముదలాZ్వార్లనుగూర్చి పరమపదం నుండి వచ్చి అవతరించారని పలికారు కదా! **"వకుళభూషణ భాస్కరోదయత్తిలే"** (ఆచార్య హృదయమ్-83) అని శఠకోపాష్టక సూక్తిని (వకుళ భూషణ భాస్కరాయ) అనుసరించి ఆచార్యహృదయ గ్రంథకారులు కూడా నమ్మాZ్వార్లు అనే సూర్యుడు ఉదయించినట్లుగా పలికారుకదా! ఈ తనియన్‌లోకూడా **"వకుళత్తారానై"** అనేకదా నమ్మాZ్వార్లు నిర్దేశింపబడ్డారు.

నమ్మాZ్వార్లు అవతరించి చేసిన పని ఇకపై తెలుపబడుతున్నది. **(ఆశిరియప్పా వదనాల్ అరు మఱైనూల్ విరిత్తానై)** తమిళభాషలో **"వెణ్బా"** మొదలైన పలు రీతులలో ఛందస్సులున్నా, **"ఆశిరియప్పా"** అనే ఛందస్సులో ఈ తిరువాశిరియమ్ అనే దివ్యప్రబంధాన్ని ఆZ్వార్లు అనుగ్రహించారు. **"అరు మఱై నూల్ విరిత్తానై"** అంటే- అరుదైన వేదం అయిన శాస్త్రాన్ని వివరించినవారని భావం. **"అరు మఱై నూల్ విరిత్తాన్"** అన్నదే పేరుగా కలవారయ్యారని భావం. అరుదైన సంస్కృతవేదాన్ని **"వణ్దమిZ్ నూల్"** (గొప్ప ద్రావిడ ప్రబంధం) (తిరువాయ్-4-5-10) అనే రీతిలో ద్రావిడవేదంగా చేశారు.

**(దేశికనై ప్పరాఙ్కుశనై)** - వేదార్థాన్ని సాక్షాత్కరింపజేసికొన్న పరాంకుశులనే ఆచార్యులను.

**(తికZ్ వకుళ త్తారానై)** - ప్రకాశించే అందమైన వకుళమాలికను వక్షఃస్థలంలో కలవారిని. **"తణ్డుళపత్తారానై"** (చల్లని తులసీమాలను వక్షఃస్థలంలో కలవాడు) అని భగవానుని నిర్దేశించినట్లే, **"తామమ్ తుళవో? వకుళమో?"** (నీవు ధరించే మాల తులసీమాలా? లేక, వకుళమాలికా?) - అని అంటూ నమ్మాZ్వార్లు భగవానుడనే ద్రావిడకవులు పాడిన పాశురంలో చెప్పబడింది కదా!

**(మాశడైయా మనత్తు వైత్తు)** - **"మాశ ₹\ార్ మనత్తుళ్ళానై"** (మాలిన్యం లేని వారి మనస్సులో ఉన్నవాడు) - (తిరుమాలై-22) అని, **"తెళిన్ద ఎన్ శిన్దై అకమ్ కZియాదే"** (స్వచ్ఛమైన నా మనస్సును విడుకుండా) (తిరువాయ్-9-2-4) అని పలికే రీతిలో దోషం లేకుండా స్వచ్ఛంగా ఉండే మనస్సులో ప్రతిష్ఠించుకొని - **"వణ్కురుకైక్కోనారుమ్ నమ్మ్మడై క్కుడి వీ₹\రున్దార్"** (అందమైన కురుకాపురీశులైన నమ్మాZ్వార్లు మన మనసు అనే ఇంటిలో వేంచేసి ఉన్నారు) అని అనే రీతిలో మన మనస్సులో పొందికగా పెట్టుకొని- అని భావం. విషయవైరాగ్యాన్ని కల్గిన పరమహంసలు కనుక దాసుల మనఃపద్మం అనే పద్మాసనంలోకదా వీరు వేంచేసి ఉంటారు.

**(వకుళత్తారానై మాశడైయా మనత్తు వైత్తు)** - **"నాట్కమZ్ మకిZ్మాలై మార్బిన్ మాఱన్ శడకోపన్"** (దినాలు గడిచేకొద్దీ గడిచేకొద్దీ పరిమళం వికసించే వకుళమాలను

వక్షఃస్థళంలో కల మాఱన్ అనబడేవారు, శఠకోపులు) (తిరువాయ్. 4-10-11) అని తమను తామే నిర్దేశించుకొన్న ఆZ్వార్లను **“శడకోపనై శిన్దైయుళ్ళే పెయ్‌దఱ్కు ఇశైయుమ్ పెరియవర్ శీర్”** (నమ్మాZ్వార్లను మనస్సులో ఉంచుకోవడానికి అంగీకరించే మహనీయుల కల్యాణగుణాలు) (ఇరామానుశ-18) అని అముదనార్ పాడిన రీతిలో ధ్యానానికి మంగళవిషయంగా తలచి, భక్తిని కల్గి ఉండి.

**(మఱవామల్ వాZ్త్తుతుమే)** - మఱపు లేకుండా ఉండే ఈస్థితికి మంగళా శాసనం చేద్దాం. నమ్మాZ్వార్లుకూడా **“ఊZితోరూZ యోవాదు వాZియ వెన్ఱు యామ్ తొZ ఇశైయుఙ్గోల్”** (తిరువాశిరియమ్-4) అని ఈ విధంగా ఎల్లప్పుడు మంగళాశాసనం చేయడానికే ఆశపడ్డారు కదా!

ఈ రీతిలో ఈ పాశురం ద్వారా ఆZ్వార్ల దివ్యమైన తిరుమేనియే ధ్యానానికి మంగళమైన విషయం అని, పల్లాండు పాడడానికి అదే విషయం అని చెప్పినట్లయింది.

తనియన్ వ్యాఖ్యానానువాదం ముగిసింది.

---

# తిరువాశిరియమ్ - పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానమ్

## అవతారికై

**తిరువిరుత్తత్తిల్, సర్వేశ్వరనుడైయ స్వరూపరూపగుణవిభూతికళై క్కాట్టిక్కొడుక్క క్కణ్డు, అవనుడైయ నిత్యవిభూతియోగత్తైయుమ్, లీలావిభూతియోగత్తైయు మను సన్ధిత్తు, (అన్ద) నిత్యవిభూతియిలుళ్ళార్ నిరతిశయానుభవమే యాత్రైయా యిరుక్కిఱ పడియైయుమ్, అతు ఉణ్డాఱుక్కైక్కు ఈడాన ఆరోగ్యత్తై యుడైయరాయిరుక్కిఱ పడియైయుమ్, ఇవ్వరుకుళ్ళార్ కర్మపరతన్త్రరాయ్, ఇతరవిషయఙ్గళిలే ప్రవణరాయ్, తణ్ణియతాన దేహయాత్రైయే భోగమాయిరుక్కిఱ పడియైయు మనుసన్ధిత్తు, భ్రాతాక్కళిలే శిలర్ జీవిక్క, ఒరువన్ కుఱైయ జీవిక్కప్పుక్కాల్, తన్ కుఱైయై అనుసన్ధిత్తు వెఱుక్కు మాపోలే, సర్వేశ్వరనోడొక్క నిత్యానుభవమ్ పణ్ణుకిఱవర్కళోడొక్క త్తమక్కు ప్రాప్తి యుణ్డా యిరుక్కచ్చెయ్‌తే, తామ్ అత్తై యిZన్దిరుక్కిఱపడియైయు మనుసన్ధిత్తు, “ఇతుక్కడి దేహసమ్బన్ధమ్” ఎన్ఱు పార్‌త్తు, ఇత్తై క్కZిత్తుక్కొళ్ళలామ్ పడి తమ్బక్క లొన్ఱుమ్ కాణామల్, ఇన్ద ప్రకృతిప్రాకృతఙ్గళోట్టై సమ్బన్ధత్తై అఱుత్తుత్తర వేణుమ్” ఎన్ఱు అవన్తిరువడికళిలే తమ్ముడైయ దశైయై విణ్ణప్పమ్ శెయ్‌తార్.**

**ఇతుపిన్నై, ముతఱ్పాట్టుక్కు క్కరుత్తన్నో? ఎన్నిల్, ముతలిలేయుమ్ ఇప్పాశురత్తై అరుళిచ్చెయ్‌తు, ముడివిలేయుమ్ “అZున్దార్ పిఱప్పామ్ పొల్లా వరువినై” ఎన్ఱు,**

ఉపక్రమోపసంహారజ్గళ్ ఏకరూపమాయిరుక్కైయాలే- ఇప్ప్రబన్ధత్తుక్కు త్తాత్పర్య మతువే. తామ్ నినైత్తపోతే తమ్ముడైయ అపేక్షితమ్ కిడైయామైయాలే పిఱన్ద ఆ€\ామైయై ఆవిష్కరిత్తపడి - నడువిల్ పాట్టుక్కళ్ అడైయ. సర్వేశ్వరనుక్కు ఇవరపేక్షితమ్ శడక్కేన చ్చెయ్యప్పోకాతు; అతుక్కడి శరతల్పత్తాప్పోలే, ఇవరై ఇడువిత్తు చ్చిల ప్రబన్ధజ్గళై ప్రవర్తిప్పిత్తు సంసారత్తై త్తిరుత్త నినైత్తవనాకైయాలే. ఇజ్జే వైక్కలామ్బుడి యల్ల ఇవరుడైయ త్వరై. "ఇవర్తామ్ నిర్బన్ధమ్ పణ్ణుకిఱతుమ్ అవ్వరుకే పోయ్ నమ్ముడైయ గుణాను భవమ్ పణ్ణుకైక్కాక విఱే. ఇవైతన్నై (ఇజ్జే) అనుభవిప్పిప్పో-మెన్ఱు పార్త్తు, త్తన్నుడైయ స్వరూపరూపగుణవిభూతికళై క్కాట్టిక్కొడుక్క, దేహత్తినుడైయ తణ్మైయై అనుసన్ధిప్ప తఱ్కు మున్బు కాట్టిక్కొడుత్తతు ఇవైయే యాకిలుమ్, "అవ్వరుకే పోయనుభవిప్పతుమ్ ఓరనుభవ ముణ్డు" ఎన్ఱు తో€\ాతపడి ఒరు వైశద్యత్తై ప్పిఱప్పిక్క, అవ€\ిలే అన్యపరరాయ్ అనుభవిక్కిఱార్.

స్వరూపరూపగుణజ్గళెన్నిఱే అడైవు; స్వరూపత్తై విట్టు రూపత్తిలే యిZన్దు అనుభవిక్క వేణు మెన్గిఱారాయి€\ు- తామ్ తువక్కుణ్డిరుప్పతుమ్ ఇతిలే యాకైయాలే. ఇని, ఇవ్వస్తుతాన్ నేర్కొడునేరే అనుభవిక్క వొణ్ణాతపడి ముకత్తిలే అలై యెఱికైయాలే కిణ్ణకత్తిలే ఇZవార్ మితప్పుక్కొణ్డు ఇZయుమాపోలే. "ఉపమాన ముఖత్తాలే ఇZన్దు అనుభవిక్కవేణుమ్" ఎన్ఱు పార్త్తార్. సర్వథా సామ్య మిల్లాత తొరు వస్తువాకైయాలే భగవద్విషయత్తుక్కు ఉపమానమాక చ్చొల్లలావతుతానిల్లై. ఆనాలుమ్, అల్పసామ్య ముళ్ళతొన్నై ప్ప€\ి యిZయ వేణుమిఱే. ఒరు మరకతగిరియై యాయి€\ు ఉపమానమాక చ్చొల్లుకిఱతు. అతిన్బక్కల్ నేర్కొడు నేరే కొళ్ళలావతు ఒన్ఱిల్లామైయాలే అతుతన్నై శిక్షిత్తుక్కొణ్డు ఇZకిఱార్. స్వరూపత్తై విట్టు రూపత్తై ప్ప€\ినవోపాతి, రూపన్దన్నైయుమ్ విట్టు ఉపమానత్తిలే యిZన్దు, అతు తనక్కు ఒప్పనై తేడి ఎడుత్తు ప్పేశుకిఱార్.

---

పరమకారుణికులు పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన
వ్యాఖ్యానానికి అనువాదం

## అవతారిక

తిరువిరుత్తప్రబంధంలో భగవానుడు తనయొక్క స్వరూపం, రూపం, కల్యాణ గుణాలు, ఉభయవిభూతులు- అనబడే సంపదను అంతటిని ఈ ఆZ్వార్లకు "మయర్వఱ మదినలమ్ అరుళినన్" (తిరువాయ్ -1-1-1) (భ్రమ విప్రలంభాది దోషాలు

లేని, భక్తిరూపాన్ని పొందిన జ్ఞానాన్ని అనుగ్రహించాడు) అనే రీతిలో దర్శింపజేయగా, ఆళ్వార్లు వాటిని దర్శించి, అతడు నిత్యవిభూతితో, లీలావిభూతితో కూడి ఉండే స్థితిని మనస్సులో భావించారు. నిత్యవిభూతి అనే పరమపదంలో ఉండేవారు సర్వదా భగవానుని పరిపూర్ణంగా అనుభవించడమే కాలక్షేపంగా ఉండే రీతిని, ఆ విధంగా అనుభవించడానికి తగినట్లుగా వారు ఆరోగ్యాదులను కలవారై ఉండడాన్ని, ఈ లీలావిభూతిలో ఉండేవారు కర్మకు వశులై, ప్రాకృతవిషయాలలో అభినివేశాన్ని కలవారై, చాలా హేయమైన శరీరంకోసం జీవించే జీవనమే భోగ్యంగా భావించేవారై ఉండడాన్ని గమనించారు. తోడబుట్టిన సహోదరులలో కొందఱు పరిపూర్ణమైన ఆనందాన్ని అనుభవిస్తూ ఉండగా, వారిలో ఒక్కడు మాత్రం ఆ విధంగా పూర్ణజీవితాన్ని ఆనందించలేనివాడై ఉంటే, అతడు తన కొఱతను తలచి నైరాశ్యంతో పల్కినట్లుగా, సర్వేశ్వరుని నిత్యం దర్శిస్తూ ఆనందించే నిత్యసూరులవలె తమకు అనుభవించే ప్రాప్తి ఉన్నా, తాము ఆ అనుభవాన్ని కోల్పోవడాన్నిగూర్చి భావించారు. దీనికి కారణం తమకు ఉండే ఈ ప్రాకృతమైన దేహసంబంధమే అని వివేకించి తెలిసికొని, ఈ అనాది సంబంధాన్ని లేకుండా చేసికోవడంకోసం తగిన దారి తమవద్ద ఏదీ లేదని గుర్తించి, "ఈ ప్రకృతి ప్రాకృతాల పరంపరాసంబంధాన్ని నీవే పూర్తిగా నశింపజేయాలి'' అని అంటూ భగవానుని శ్రీపాదాలలో తమ నిస్సహాయస్థితిని విన్నపించారు. **"పొయ్న్నిన్ఱ ఞానముమ్... విణ్ణప్పమే"** (తిరువిరుత్తమ్ -1) అనే తిరువిరుత్త ప్రబంధంలోని మొదటి పాశురంయొక్క అర్థం ఇదేనా? అని అంటే, చివరలో ఫలాన్ని తెలిపేటప్పుడుకూడా **"అZున్దార్ పిఱప్పామ్ పొల్లా అరువినై"** (తిరువిరు-100) అని పల్కినందువల్ల ఈవిధంగా మొదట చివరకూడా ఇదే చెప్పబడినదానినిబట్టి తిరువిరుత్తం మొత్తానికి ఇదే తాత్పర్యం అని నిర్ణయించవచ్చు. నడుమన గల పాశురాలు అన్నీ మఱి ఎందు కోసం? అని అంటే, తాము మొదటి పాశురంలో ప్రార్థించగానే తమ ప్రార్థన నెఱవేరనందున వారికి కల్గిన ఆర్తిని మధ్యలోగల పాశురాలద్వారా ఆళ్వార్లు వ్యక్తం చేశారు. అంతే.

భగవానుడు వీరు కోఱిన రీతిలో వీరికి గల దేహసంబంధాన్ని వెంటనే తొలగించాలని భావించలేదు. దానికి కారణం ఏమంటే - అంపశయ్యపై శయనించిన భీష్మునిద్వారా కొన్ని ఉపదేశాలను చేయించి, లోకానికి జ్ఞానాన్ని కల్గించినట్లే, వీరిద్వారా కొన్ని దివ్యప్రబంధాలను ప్రవర్తింపజేసి, ఈ సంసారాన్ని సంస్కరించాలని అనుకోవడమే. అయితే, ఈ లోకంలో ఉండడం సహించలేని రీతిలో ఆళ్వార్ల ఆర్తి అతిశయించి ఉన్నది. ఆ ఆర్తియొక్క వేగాన్ని అడ్డుకోవడంకోసం. "ఈ ఆళ్వార్లు ఈవిధంగా

తమ సంసారసంబంధాన్ని వెంటనే తీర్చమని తొందరపడడం నా కల్యాణగుణాల అనుభవం కోసమే కదా! ఆ గుణానుభవాన్ని ఇక్కడే వీరికి కల్గిస్తాను'' అని ఆలోచించి, తన స్వరూపరూపగుణవిభూతులను అన్నిటినీ ఆళ్వార్లకు దర్శింపజేశాడు. ఆళ్వార్లు దేహంయొక్క నైచ్యాన్ని అనుసంధించడానికి ముందే ఈ స్వరూపాదులను వీరికి దర్శింపజేసినా, ఇపుడు దానికిమించి ఒక విధమైన జ్ఞానవికాసాన్ని కల్గించి, స్వరూపాదులను అనుభవింపజేశాడు. ఆ జ్ఞానవికాసంవల్ల "పరమపదానికి చేరి అనుభవించే వేఱొక అనుభవం ఉన్నది'' అని తోచని రీతిలో ఒక గొప్ప అనుభవం ఆళ్వార్లకు కల్గినందువల్ల, ఇదికాక అక్కడకు వెళ్ళి అనుభవించవలసిన అనుభవం ఏదీ లేదు అని తలుస్తూ, ఈ అనుభవంలోనే నిమగ్నులై తమ అనుభవాన్ని ఈ ప్రబంధంద్వారా వ్యక్తం చేస్తున్నారు.

భగవానుని అనుభవించేటపుడు స్వరూపరూపగుణాలనే క్రమంలో అనుభవించడం ఒక క్రమం. ఆళ్వార్లు ఈ పాశురంలో స్వరూపాన్ని విడచి, రూపంలో ప్రవేశించి అనుభవించడం ప్రారంభించారు. తాము అభినివేశాన్ని పొందిన రూపంలోనే కనుక ఆవిధంగా రూపాన్ని దర్శించాలని ప్రారంభించినా, ఆ రూపం నేరుగా అనుభవించడానికి వీలులేనట్లుగా అనుభవించేవారిని అది ఉక్కిరి బిక్కిరి చేస్తున్నందున, "ప్రవాహంలో దిగేవారు, ఒక తెప్పను ఆధారంగా చేసికొని అనుభవించాలి'' అని భావించారు. అయినా, భగవానుని రూపానికి అన్నివిధాలుగాను సరిపోయే ఏ వస్తువు లేనందువల్ల దీనికి ఏదీ ఉపమానంగా చెప్పడం వీలు లేదు. కాని, ఒక కొంత సామ్యాన్ని పురస్కరించుకొని దేనినో ఒక దానిని ఉపమానంగా పల్కి అనుభవించాలని ప్రయత్నించారు. ఒక మరకతపర్వతమే ఇక్కడ ఈ రూపానికి ఉపమానంగా చెప్పదగినట్లున్నది. నేరుగా మరకతపర్వతాన్నిమాత్రం ఉపమానంగా పల్కితే ఈ రూపానికి ఏవిధంగానూ అది ఉపమానం కాలేదు కనుక, ఆ మరకత పర్వతానికి పలు పరిష్కారాలను చేస్తూ, దానిని ఉపమానంగా ఆళ్వార్లు పల్కుతున్నారు. స్వరూపాన్ని విడచి రూపాన్ని పల్కినట్లే, రూపాన్ని విడచి ఉపమానాన్నే చెప్పాలని ప్రారంభించి, అదికూడా నేరుగా చాలదు కనుక దానికి పలు అలంకారాలను అన్వేషించి, కొనివచ్చి అలంకరించి, పల్కుతున్నారు.



మహేన్ద్రాద్యాః ప్రతిషిద్ధా స్తు పూజనే", "తిరువడితన్నామ్ మఱన్దు మ్బుఱన్దొZా మాన్దర్" ఎన్నక్కడవతిఱే. భర్తావిన్ పక్కల్ ఆనుకూల్యమ ్రుక్క, భర్త్రన్తరపరిగ్రహ మ్పణ్ణాతొZకైయిఱే ఇవళ్ అవనుక్కాకై యాకిఱతు. భగవత్ప్రావణ్యమ్ క్రమత్తిలే పిఱక్కవుమామ్. ఇవనుక్కు మున్దుఱ వేణ్డువతు దేవతాన్తరస్పర్శ మఱుకైయిఱే. ఇతు ఉణ్డానాల్ యోగ్యతై కిడక్కుమిఱే.

పెరియవాచ్చాన్ పిళ్ళై అరుళిచ్చెయ్త తిరువాశిరియవ్యాఖ్యానమ్ ము్్

పెరియవాచ్చాన్ పిళ్ళై తిరువడికళే శరణమ్

---

*అరు :- ఏZామ్బాట్టు- (సృష్టిక్కు అనురూపమ్) 'నాలు ముఖత్తాలుమ్ వేదోచ్చారణమ్ పణ్ణి సృష్టిక్కై. "తళిరొళి"- నీలమాయిరుక్కిఱ తళిరిన్ నిఱత్తై యుడైయవన్. 'శిఱితు"- తిరువయి్ల్ ఏకదేశత్తిలే. 'ఉడన్' శేర్న్దు. 'మయక్క' - కలక్కైయాయ్. సుఖిక్కై ఎన్ఱు మున్దిన అర్థమ్. "ఒరుమా"- ఒరు ఎన్ఱు క్షుద్రమాయ్, మా ఎన్ఱు అల్పమాయ్, అత్యన్తమ్ క్షుద్రదేవతైయై యుడైయో మల్లో మెన్ఱపడి. అన్దాతియాయ్ వన్దతు ముడివిలు మన్దాతియాక వేణ్డావో? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (అన్దాతియాయ్) ఇత్యాది. శెక్కరెన్ఱు ముడియుమ్బోతు దేవతాన్తరవిషయమ్ పణ్ణప్పోకామైయాలే- ఎన్ఱపడి.*

తిరువాశిరియవ్యాఖ్యానమ్ అరుమ్బదమ్ ము్్

---

## దివ్యార్థ దీపిక

సకలచేతనర్కళుమ్ స్వరూపప్రాప్తశేషియాన ఎమ్బెరుమానై అడి పణిన్దు, అవనుక్కే వZువిల్లా అడిమైకళ్ శెయ్య ప్రాప్తమాయిరుక్క అప్పడి శెయ్యాతే, దేవతాన్తరఙ్గళై ఆశ్రయిత్తు సంసారత్తైయే పూణ్కట్టి క్కొళ్ళువర్కళే! అన్దో ! ఇతు ఎన్న అనర్థమ్!- ఎన్ఱు కీZప్పాట్టిల్ కవలైప్పట్టార్. ఒరు సంసారియావతు ఇవరుడైయ తుయరత్తై ప్పరిహరిక్క మున్ వరామఱ్పోకవే, "ఇప్పాZమ్ సంసారికళ్ ఎక్కేడావతు కెడట్టుమ్! నాముమ్ అవర్కళైప్పోలే అనర్థప్పట్టు ప్పోకామల్ ఎమ్బెరుమానుక్కే అడిమై ప్పట్టిరుక్కప్పె్ోమే!" ఎన్ఱు తమ్ముడైయ మనవుఱుదిక్కు ఉకన్దు పేశుకిఱార్ ఇదిల్.

"సంసారికళ్ ప్కిఱ దేవతాన్తరఙ్గళ్ యావుమ్ నమ్మైప్పోలవే ఆపత్తుక్కళుక్కు ఉళ్ళాకి ఎమ్బెరుమానుడైయ తిరువరుళాల్ తప్పి ప్పిZప్పవర్కళే యొZయ,

పిఱరుడైయ ఆపత్తుక్కళై త్తామ్ పరిహరిక్క వల్ల సర్వశక్తర్‌కళ్ అల్లర్" - ఎన్బదు విళక్క వేణ్డి "ఇన్ద ద్దేయ్‌వఙ్గళెల్లామ్ ప్రళయకాలత్తిల్ ఎమ్బెరుమానతు తిరువయి[?]లే పడుక్కిక్కిడన్దవై కాణ్మిన్" ఎన్గిఱార్. ఎల్లా ద్దేయ్‌వఙ్గళైయుమ్ ఉయ్యక్కొణ్డ పరమ పురుషనాన శ్రీమన్నారాయణునక్కన్ఱి మ[?]ు యార్‌క్కుమ్ నామ్ అడిమై ప్పట్టవర్‌కళ్ అల్లోమ్ - ఎన్బదు నిగమనమ్.

"నళిర్‌మది చ్చడైయనుమ్" ఎన్ఱ విడత్తుప్పెరియవాచ్చాన్ పిళ్ళై అరుళిచ్చెయల్- "సాధకవేషమ్ తో[?]\ జటైయై ధరిత్తు క్కొణ్డిరుక్కచ్చెయ్‌దేయుమ్ దుర్మానత్తాలే సుఖప్రధానన్ ఎన్ఱు తో[?]\మ్బడి తాZమడలై క్కోటి త్తలైయిలే వైప్పారైప్పోలే కుళిర్‌న్ద చన్ద్రనై జటైయిలే ధరిత్త రుద్రనుమ్" ఎన్ఱు. ఇదిల్ "తాZమడలై క్కోటి" ఇత్యాది దృష్టాన్తవాక్యత్తిఱ్కు ప్పొరుళ్ యాదెనిల్? - ఉలకిల్ మూట్టై శుమన్దు వరున్ది క్కూలి జీవనమ్ పణ్ణుకిఱవర్‌కళ్ తాఙ్గళ్ కష్టప్పడుకిఱవర్‌కళ్ ఎన్బదు పిఱర్‌క్కు త్తెరియామైక్కాకవుమ్, ఇవర్‌కళ్ సుఖమాక ఇరుప్పవర్‌కళ్ ఎన్ఱు పలరుమ్ నినైత్తుక్కొళ్ళ వదఱ్కాకవుమ్ తాZమ్బూ ముదలియ పూక్కళై ఎడుత్తు చ్చూట్టిక్కొణ్డు తిరివర్‌కళామ్. అప్పడియే శివపిరానుమ్ తాన్ సంహారక్కడవుళ్ ఎన్బదైయుమ్ పిఱర్ అఱిన్దు అరువరుక్కామైక్కాకవుమ్ "ఇవన్ ఉల్లాసమాక ఇరుక్కక్కూడియ రసికన్" ఎన్ఱు పలరుమ్ నినైత్తు కొళ్ళవదఱ్కాకవుమ్ అZకియ చంద్రకళైయై చ్చిరమీదు అణిన్దాన్ పోలుమ్ - ఎన్ఱు వినోదమాక అరుళిచ్చెయ్‌దపడి.

ఇన్దిరన్, అరమ్బై ఊర్వశిముదలియ అప్సరస్ స్త్రీకళ్ తన్నై నన్గు కాదలిక్కుమ్బడి అలఙ్కారఙ్గళ్ శెయ్‌దుకొణ్డు, అతనాల్ మేని నిఱమ్ వీఱు పె[?]రుప్పనాదలాల్ "తళిరొళి" ఎన్ఱు విశేషిక్కప్పట్టాన్. ఆక, ముక్కియమాక ఉళ్ళ మూన్ఱు దేవర్‌కళై చ్చొల్లవే మ[?]\ చేతనాచేతనఙ్గళై వివరిత్తు చ్చొల్లవేణ్డామై ప్ప[?] "ముదలా యావకై యులకముమ్ యావరు మకప్పడ" ఎన్ఱార్. ఎమ్బెరుమానతు తిరువయి[?]నుళ్ళే అడఙ్గి క్కిడన్దు సత్తై పె[?]\ పదార్థఙ్గళై నామ్ వాయ్‌కొణ్డు శొల్లువతుమ్ ఎమక్కు ప్పెరుమ్ పాక్కియమన్ఱో! - ఎన్ఱెణ్ణి, "నిల నీర్ తీ కాల్ శుడరిరు విశుమ్బుమ్ మలర్ శుడర్" ఎన్ఱు మీణ్డుమ్ వివరిత్తు చ్చొల్ల త్తొడఙ్గినర్‌పోలుమ్.

"శిఱితుడన్ మయఙ్గ" ఎన్బదఱ్కు ప్పలవకైయుమ్ పొరుళ్ కొళ్ళలామ్. (కీZ చ్చొన్న వస్తుక్కళెల్లామ్) శిఱితు - మిక చ్చిఱియ వడివత్తై ఉడైయనాయ్ క్కొణ్డు, ఉడన్ -ఏకకాలత్తిలే, మయఙ్గ- ఉళ్ళే యడఙ్గుమ్బడియాక- ఎన్బతు ఒరు వకై. "ఉడన్ మయఙ్గ' ఎన్ఱవిడత్తు "ఉడల్ మయఙ్గ" ఎన్ఱు పదమ్ పిరిత్తు, శిఱితాకియ ఉడలిలే,

పేత్తైక్కు Zవియాన ఎమ్బెరుమానతు మికచ్చిఱియ వడివిలే మయఙ్గి- ఎన్ఱల్ మ ిారు వరై. మ \ుమ్ కణ్డుకొళ్క. ఆక, ఎల్లా ప్పదార్థఙ్గళైయుమ్ ఒన్ఱు తప్పామల్ తిరువయి ిినుళ్ళే అడక్కిక్కొణ్డు, 'పాలన్ తనదురువాయ్ ఏZులకుణ్డు ఆలి లైయిన్, మేలన్ఱు నీ వళర్న్ద మెయ్యెన్బర్' ఎన్ఱపడి శిఱితు కుZన్డై వడివమాకి ముకిZ విరియాద శి ిాలన్దళిరిలే కణ్వళర్న్ద అఱ్పుతశక్తి వాయ్న్ద శ్రీమన్నారాయణ మూర్త్తియై త్తవిర్న్దు వేఱొరు దెయ్వత్తై నామ్ దెయ్వమాక క్కొళ్ళోమ్.

"నె ిిమేఱ్కణ్ణానుమ్ నిఱైమొZివాయ్ నాన్ముకనుమ్ నీణ్డ నాల్ వాయ్ ఒ ిిక్కై వెన్బక్కట్టిలొరువనైయు ముళ్ళిట్ట వమరరోడుమ్, వె ిిప్పోర్ క్కడలరైయన్ విZుఙ్గామల్ తాన్ విZుఙ్గి ఉయ్యక్కొణ్డ కొ \ప్పోరాZియాన్ కుణమ్ పరవర తొణ్డర్క్కొడియవరాఱే" ఎన్ఱుమ్, 'అన్ఱెల్లారుమ్ మఱియా ఎమ్బెరుమాన్ ఉణ్డుమిZ్న్ద ఎచ్చిల్తేవర్, అల్లాతార్ తాముళరే" ఎన్ఱుమ్ (పెరియతిరుమొZి) తిరుమఙ్గై యాZ్వార్ అరుళిచ్చెయ్ద పాశురఙ్గళ్ ఇఙ్గే అనుసంధిక్కత్తక్కవై. "మఙ్గైపాకన్ శడైయిల్ వైత్త కఙ్గైయార్ పదత్తు నీర్? అఙ్గణ్ ఞాల ముణ్డపోతు వెళ్ళి వెఱ్పుకన్ఱతో! ఆతలాల్ అరఙ్గనన్ఱి వేఱు దెయ్వ మిల్లైయే" ఎన్ఱ పిళ్ళైప్పెరుమాళ్ ఐయఙ్గార్ విడుది ప్పాశురముమ్ కుఱిక్కొళ్ళత్తక్కతు.

ఇద్దివ్యప్రబంధమ్ పెరుమ్బాలుమ్ ఎమ్బెరుమానుడైయ పరతత్త్వస్థానత్తిలే నోక్కుడైయదెన్ఱు ఉణరత్తక్కతు.

తిరువిరుత్తత్తిలుమ్, తిరువాయ్మొZియిలుమ్ ఆZ్వార్ తమ్ముడైయ తిరునామత్తై అరుళిచ్చెయ్దుళర్. ఇప్పిరపన్దత్తిల్ అప్పడి అరుళిచ్చెయ్య విల్లై- ఎన్బదై క్కారణమాకక్కొణ్డు శిలర్ శొల్లువదావతు- "ఇత్తిరువాశిరియమ్ ఇన్నుమ్ పల పాశురఙ్గళైయుడైయ పిరపన్ద మాయిరున్ద" దెన్ఱుమ్; "కాలక్రమత్తిల్ శిల పాశురఙ్గళ్ లోపిత్తు విట్టన"- ఎన్ఱుమ్ శొల్లుకిఱార్కళ్. నమ్మాZ్వార్ అరుళిచ్చెయ్త నాన్గు పిరపన్దఙ్గళుళ్ ఇదఱ్కు అడుత్తదాన పెరియతిరువన్దాదియిలుమ్ ఆZ్వారుడైయ తిరునామమ్ అరుళిచ్చెయ్యప్పట్టిరుక్కవిల్లై. ఆకైయాల్, ఇతు శేరాతు. అన్దాదిత్తొడైయాక అమైన్ద పిరపన్దఙ్గళ్ ఎల్లావ ిిలుమ్ ముడివు పాశురత్తిల్ అన్తముమ్, ముదఱ్పాశురత్తిన్ ఆదియుమ్ ఒన్ఱాక అమైయుమ్బడి అరుళిచ్చెయ్యప్పట్టిరుప్పతుపోల్ ఇప్పిరపన్దత్తిల్ అమైయామైయాల్ ఇతై క్కొణ్డు ఇతిల్ శిల పాశురఙ్గళ్ లోపిత్తు విట్టన- ఎన్ఱు శొల్లువర్ శిలర్. అతువుమ్ శేరాతు. ఈ \చ్చెయ్యుళిన్ అన్తమే ముదఱ్చెయ్యుళిన్ ఆదియాక అమైయవైత్తల్ "మణ్డలిత్తల్" ఎన్ఱు తమిZర్ శొల్లివైత్తిరుక్కైయాల్ ఇప్పిరపన్దమ్

మణ్డలిత్తలాకాతు- ఎన్ఱు శొల్లలామత్తనై యొZియ, పాశురఙ్గళ్ లోపిత్తన - ఎన్ఱల్ పొరున్దమాట్టాతు. ఆకవే, ఇప్పిరపన్దమ్ పూర్ణ మెన్ఱే కొళ్ళత్తక్కతు.

ఆZ్వార్ తిరువడికళే శరణమ్

శ్రీకాఞ్చీప్రతివాదిభయఙ్కరమ్ అణ్ణఙ్గరాచార్యర్ ఇయ f\ియ

తిరువాశిరియమ్ దివ్యార్థదీపికై ము f\ుప్పె f\తు.

## దివ్యార్థదీపిక - అనువాదం

సకలచేతనులు స్వరూపప్రాప్తశేషి అయిన భగవానుని శ్రీచరణాలను సేవించి, అతనికే నిరంతరమైన కైంకర్యాలను చేయడం తగి ఉండగా, ఆ విధంగా చేయకుండా దేవతాంతరాలను ఆశ్రయించి, సంసారాన్నే గొంతుకు చుట్టుకొనేవారలారా! అయ్యో! ఇది ఏమి అనర్థం!'' అని గత పాశురంలో బాధపడ్డారు. ఒక సంసారిగా అయినా వీరి దుఃఖాన్ని పరిహరించడంకోసం ముందుకు రాకపోవడంతో, "ఈ పాడు సంసారులు ఏ చెడ్డను పొందినా పొందనీ! మేము వారివలె అనర్థాన్ని పొందకుండా, భగవానునకే శేషంగా కాగలిగాముకదా!'' అని తమ మనోనిశ్చయానికి సంతోషిస్తూ ఇందులో పల్కుతున్నారు.

"సంసారులు ఆశ్రయించే దేవతాంతరాలు అన్నీ మనవలెనే ఆపత్తులకు లోనై భగవానుని అనుగ్రహంవల్ల వాటినుండి బయటబడేవారే తప్ప, ఇతరుల ఆపదలను తాము పరిహరించుకోగల సర్వశక్తులు కారు''- అనే విషయాన్ని వివరించగోరి, "ఈ దైవాలన్నీ ప్రళయకాలంలో భగవానుని ఉదరంలో పడి ఉన్నాయిసుమా!'' అని అంటున్నారు. అన్ని దైవాలను తరింపజేసిన పరమపురుషుడైన శ్రీమన్నారాయణునకు తప్ప ఇక ఎవరికీకూడా మనం శేషభూతులం కాము- అని పర్యవసానం.

**"నళిర్ మదిచ్చడైయినుమ్"** అనేటపుడు పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తి -''సాధక వేషం స్ఫురించేటట్లు జటలను ధరించి ఉన్నా, దురభిమానంతో సుఖప్రధానుడు అనే విషయం స్ఫురించే రీతిలో తాటిమట్టను చీల్చి తలలో పెట్టుకొనేవారివలె, చల్లని చంద్రుని జటలో ధరించిన రుద్రుడు'' **(సాధకవేషమ్‌తో f\ జటైయై ధరిత్తుక్కొణ్డి రుక్కచ్చెయ్‌దేయుమ్, దుర్మానత్తాలే "సుఖప్రదానన్" ఎన్ఱు తో f\ుమ్బడి తాZ మడలై క్కీఱి త్తలైయిలే వైప్పారైప్పోలే కుళిర్న్ద చన్ద్రనై జటైయిలే ధరిత్త రుద్రనుమ్")** అని ఉన్నది. ఇందులోని - **"తాZమడలై క్కీఱి"** అనే దృష్టాంత వాక్యానికి అర్థం ఏమి? అని అంటే, లోకంలో మూటలను మోసి శ్రమపడి కూలి

జీవనాన్ని సాగించేవారు 'తాము కష్టపడుతున్నాము' అనే విషయం ఇతరులకు తెలియకుండా ఉండడంకోసం, "వీరు సుఖంగా ఉన్నారు"- అని పలువురు భావించడం కోసం **"తాZమ్బూ"** మొదలైన పూవులను తీసి అలంకరించుకొని తిరుగుతారట. ఆ విధంగానే శివుడుకూడా తాను సంహారదైవం అనే విషయాన్ని ఇతరులు తెలిసికొని జుగుప్సను పొందకుండా ఉండడంకోసం "ఇతడు ఉల్లాసంగా ఉండగల్గిన రసికుడు" అని పలువురు భావించడం కోసం అందమైన చంద్రకళను శిరస్సుపై అలంకరించుకొని ఉంటాడు- అని వినోదంగా పల్కడమే.

ఇంద్రుడు, రంభ, ఊర్వశి మొదలైన అప్సరసస్త్రీలు తనను బాగా ప్రేమించే టట్లుగా అలంకారాలను చేసికొని, దానివల్ల (అతని) శరీరవర్ణం శోభిల్లేటట్లుగా ఉండడంచేత **"తళిరొళి"** అని విశేషింపబడ్డాడు. అందువల్ల, ముఖ్యంగా ఉండే (బ్రహ్మ, రుద్ర, ఇంద్రులనే) ముగ్గురుదేవతలను చెప్పగానే మిగిలిన చేతనాచేతనాలను వివరించి చెప్పవలసిన అవసరం లేకపోవడాన్ని గూర్చి, **"ముదలా యావకై యులకముమ్ యావరు మకైప్పడ"** అని అన్నారు. భగవానుని ఉదరంలోపలే అణగి ఉండి సత్తను పొందిన పదార్థాలను మనం నోరార పల్కడం మను గొప్ప భాగ్యం కదా! అనితలచి, **"నిల నీర్ తీకాల్ శుడర్ ఇరు విశుమ్బుమ్ మలర్ శుడర్"** అని తిరిగి వివరించి చెప్పడానికి ప్రారంభించారు కాబోలు.

**"శిఱితుడన్ మయఙ్గ"**- అనే ప్రయోగానికి పలు రీతులలో అర్థాన్ని గ్రహించ వచ్చు. (పూర్వం పల్కిన వస్తువులన్నీ) **శిఱితు**- చాలా చిన్న రూపాన్ని కల్గినవై, **ఉడన్**- ఒకే కాలంలో, **మయఙ్గ**- లోపలే అణగిపోయేటట్లుగా- అనేది ఒక రీతిలోని అర్థం. **"ఉడన్ మయఙ్గ"** అనే చోట **"ఉడల్ మయఙ్గ"** అని పదాన్ని విభజించి, చిన్నదైన దేహంలో, చిన్న శిశువు అయిన భగవానుని చాలా చిన్నరూపంలో అణగి ఉండగా- అనడం ఇంకొక తీరు. ఇంకా ఇటువంటి వివరణలను అభ్యూహించవచ్చు. అందువల్ల అన్ని పదార్థాలను ఏ ఒక్కటినీ తప్పకుండా ఉదరం లోపల అణగి ఉండేటట్లు చేసి, **"పాలన్ తనదురువాయ్ ఏZులకుణ్డు ఆలిలైయిన్ మేలన్టు నీ వళర్న్ద మెయ్యెన్బర్"** (బాలుని రూపంలో ఏడు లోకాలను మింగి మఱ్ఱి చిగురుపై నీవు నిద్రించడం నిజమని అంటారు) అనేరీతిలో చిన్న శిశువు రూపాన్ని పొంది, చిగురు తొడగని చిన్న మఱ్ఱి ఆకుపై నిద్రించిన అద్భుతశక్తిని కల శ్రీమన్నారాయణమూర్తిని తప్ప, వేఱొక దైవాన్ని మనం దైవంగా గ్రహించము.

**"నె[illegible]మేఱ్కణ్ణానుమ్ నిఱైమొZవాయ్ నాన్ముకనుమ్ నీణ్డ నాల్వాయ్ ఒ[illegible]క్కై వెణ్బుకట్టిలొరువనైయు ముళ్ళిట్ట అమరరోడుమ్, వె[illegible]ప్పోర్ క్కడలరైయన్**

**విఌజ్ఞామల్ తాన్ విఌజ్గి ఉయ్యక్కొణ్డ కొౕ\ప్పోరాఴియాన్ కుణమ్ పరవర తొణ్డర్ క్కడియవరాతే"** అని, **"అన్తెల్లారుమ్ మఱియా ఎమ్బెరుమాన్ ఉణ్డుమిఴ్న్ద ఎచ్చిల్ తేవర్, అల్లాతార్ తాముళరే"** అని (పెరియతిరుమొఴిలో) తిరుమఙ్గై ఆఴ్వార్లు అనుగ్రహించిన పాశురాలు ఇక్కడ అనుసంధేయాలు.

**"మఙ్గైపాకన్ శడైయిల్ వైత్త కఙ్గై యార్ పదత్తు నీర్? అఙ్గణ్ ఞాల ముణ్డపోతు వెళ్ళివెఱ్పు అకత్తతో! ఆతలాల్ అరఙ్గనన్ఱి వేఱు దెయ్వమ్ ఇల్లైయే"** అనే పిళ్ళై ప్పెరుమాళ్ ఐయఙ్గార్ ముక్తకపాశురం గమనించదగినది.

ఈ దివ్యప్రబంధం ఎక్కువగా భగవాను పరత్వస్థాపనలో దృష్టిని కల్గినదని తెలియాలి.

తిరువిరుత్తంలోను, తిరువాయ్మొఴిలోను ఆఴ్వార్లు తమ తిరునామాన్ని అనుగ్రహించారు. ఈ ప్రబంధంలో ఆ విధంగా చేయలేదు - అనేదానిని కారణంగా గ్రహించి, కొందరు చెప్పే మాట ఏమంటే- "ఈ తిరువాశిరియం ఇంకా పలు పాశురాలను కల్గిన ప్రబంధమై ఉండేదని, కాలక్రమంలో కొన్ని పాశురాలు లోపించాయని". నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన నాల్గు ప్రబంధాలలో దీనికి తరువాత అనుగ్రహించిన పెరియతిరువన్దాదిలోకూడా ఆఴ్వార్లు తమ పేరును అనుగ్రహించలేదు. అందువల్ల ఇది (ఈవాదం) పొసగదు. అన్దాదిప్రక్రియగా అమరి ఉండే ప్రబంధాలు అన్నిటిలో చివరి పాశురంలో అంతం, మొదటి పాశురంలో మొదలు ఒకటిగా అమరి ఉండేటట్లు అనుగ్రహించినట్లే, ఈ ప్రబంధంలో అమరి ఉండకపోవడంవల్ల, దీనిని హేతువుగా గ్రహించి ఇందులో కొన్ని పాశురాలు లోపించాయి- అని కొందరంటారు. అది కూడా పొసగదు. చివరి పాశురంలో అంతం మొదటి పాశురంలోని ఆదిగా అమరి ఉండేటట్లు చేయడం **"మణ్డలిత్తల్"** అని తమిళులు అనడంవల్ల, "ఈ ప్రబంధం మండల అన్దాది ప్రబంధం కాదు"- అని మాత్రమే చెప్పగలం తప్ప, పాశురాలు లోపించాయని- అని అనడం పొసగదు. అందువల్ల ఈ ప్రబంధం పూర్ణమనే గ్రహించాలి.

**ఆఴ్వార్ తిరువడిగళే శరణమ్**

**శ్రీకాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారు అనుగ్రహించిన తిరువాశిరియమ్ దివ్యార్థ దీపిక అనువాదం ముగిసింది.**



### శ్రీ ఉ.వే. తిరుమలై అనన్దాణ్ పిళ్ళై కృష్ణమాచార్యస్వామివారి

# తిరువాశిరియ వ్యాఖ్యానం

తమిళభాషలో ప్రసిద్ధం అయిన ఆశిరియప్పా, కలిప్పా, వఞ్జిప్పా- అనే నాల్గు పాశురాలలో ఏడు తిరువాశిరియ పాశురాలతో కూర్చబడింది ఈప్రబంధం. **"ఆశిరియమ్"** అనే పదం శబ్దశక్తిద్వారా ఆశిరియప్పాను తెలిపి, అటువంటి ఆశిరియప్పాఛందస్సులో రచింపబడ్డ పాశురాలతో కూర్చబడిన ఈ ప్రబంధాన్ని లక్షణద్వారా తెలుపుతున్నదని పెద్దలంటారు. "తిరు" అనేది ఈ ప్రబంధానికి విశేషణం. దీనివల్ల, శబ్దమాధుర్యంచేత, అర్థపుష్టిచేత దీనికి ఉండే వైలక్షణ్యమనే శ్రీమత్త్వం వివక్షితం. ఆశిరియప్పాయొక్క లక్షణం ద్రావిడఛందోలక్షణ గ్రంథాలలో చూడవచ్చు. వివరణం వల్ల గ్రంథం పెరుగుతుందని వదలిపెట్టబడింది.

## అవతారిక

అజ్ఞానం, అన్యథాజ్ఞానం, సంశయం, విస్మృతి- అనే దోషాలు ఏమీ లేని రీతిలో శ్రియఃపతి అయిన భగవానునిచేత జ్ఞానం, భక్తి నిర్హేతుకంగా అనుగ్రహింపబడ్డ నమ్మాழ்వార్లు ఈ లోకంలోనివారు ఉజ్జీవించడంకోసం క్రమంలో అనుగ్రహించిన ప్రబంధాలు - తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియతిరువన్దాది, తిరువాయ్మొழி- అని నాల్గు.

వాటిలో, తిరువిరుత్తంలో, **"ఇమైయోర్ తలైవా! పొయ్న్నిన్ఱ ఞానముమ్ పొల్లా ఒழுక్కుమ్ అழுక్కుడమ్బుమ్ ఇన్నిన్ఱ నీర్మై ఇనియా ముఱామై... అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్ కేట్టరుళాయ్"**- శరీరమే ఆత్మ, శరీరాతిరిక్తం అయిన ఆత్మ ఉన్నా, అది స్వతంత్రం, అటువంటి స్వతంత్రవస్తువునకు లోకంలో ఉండే వస్తువులు అన్నీ శేషభూతాలు అనే ఆ యథార్థంలో స్థిరమైన జ్ఞానం, దానివల్ల కలిగే పుణ్యాపాపాలనే కర్మలు, వాటివల్ల కలిగే ప్రాకృతశరీరాలు- అని ఈ విధంగా ఇంకా ఇంకా ఏర్పడే హేయమైన స్థితిని, ఇకపై అయినా దాసుణ్ణి అయిన నేను, నాకు సంబంధించినవారు పొందకుండా ఉండేటట్లుగా రక్షించాలి అని- తమకు దాసుడు చేసే విన్నపాన్ని తమరు ఆలకించాలి- అని నిత్యసూరినాయకుడైన భగవానుని సంబోధించి ఆழ்వార్లు ప్రార్థించారు. భగవానుడు వీరిని పురస్కరించుకొని తనకు సంబంధించిన పాశురాలను పాడించి, వాటిద్వారా సంసారులను సంస్కరించాలని అనుకున్నాడు. కనుక వీరు ప్రార్థించిన శరీరసంబంధనివృత్తి అనే మోక్షాన్ని వీరికి ఇవ్వలేదు. అంత కాలవిలంబాన్ని

సహించలేని వీరు, సహించి ఉండడంకోసం భగవానుడు "వీరు మోక్షాన్ని కోరడంకూడా పరమపదానికి చేరి నా గుణాలను ఏ ఆటంకం లేకుండా అనుభవించడంకోసమేకదా! ఆ విధంగా అయినపుడు, ఆ గుణాలను ఇక్కడే వీరు అనుభవించేటట్లు చేస్తాను'' అని తలచిన తన స్వరూరూపగుణ విభూతులను భ్రమవిప్రలంభాది రహితమైన, భక్తిరూపాపన్నజ్ఞానాన్ని అనుగ్రహించిన దానికంటే మిక్కిలి విశదంగా దర్శింపజేయగా, దానివల్ల ఆ ఴ్వార్లు సంసారదుఃఖం కొంచెం మఱచిపోయి, వాటిని (భగవానుని స్వరూపరూపగుణవిభూతులను) ఈ తిరువాశిరియంలో అనుభవిస్తున్నారు.

1. అందులో, మొదటి పాశురంలో **"శెక్కర్"** అని ప్రారంభించి **"అఱితుయిల్ అమర్న్ద"** అనే పాదాలలో రూపాన్ని (దివ్యమంగళరూపసౌందర్యాన్ని) **"శివన్ అయన్"** అని ఆరంభించి, **"పెరు నాయక"** అనే పాదాలలో పరత్వమనే గుణాన్ని, **"మూవులకళన్ద శేవడియోయ్"** అనే పాదంలో సౌలభ్యాన్ని, సౌశీల్యాన్ని అనుభవించడాన్ని గమనించ వచ్చు. భగవానుని రూపసౌందర్యం అనే సముద్రం నిస్సమాభ్యధికమై, దరి చేరినవారికి నేరుగా పూర్ణంగా అనుభవించడానికి సాధ్యం కాని రీతిలో (ముఖంలో అలలు ఎగసి పడడంవల్ల) ముంచెత్తడంవల్ల, అనుభవించలేకుండా తాము ఉండలేనందువల్ల ఏదో ఒక ఉపమానంద్వారా, తెప్పను తీసికొని సముద్రంలో ప్రవేశించేటట్లు, దిగి అనుభ విస్తున్నారు. (ఇక్కడ) ఉపమానం- మరకతపర్వతం.

**తాత్పర్యం :-** ఎఱ్ఱని పెద్ద మేఘాన్ని నడుములో ధరించి, దానికంటే ఇంకా ఎఱ్ఱని తేజస్సును కల సూర్యుని శిరస్సులో ధరించి, చల్లని కిరణాలను కల్గిన చంద్రుని దానికింద, నక్షత్రాలు అనే పలు తేజస్సులను దానికింద ధరించి అలంకరించుకొని, పగడపుమయమైన పలు ప్రదేశాలను కల్గినదై ప్రకాశించే పచ్చని వర్ణాన్ని కల మరకతపర్వతం, సముద్రానికి అధిపతి అయిన వరుణుని అలలు (కెరటాలు) అనే చేతులలో నిద్రించే రీతిలో - పీతాంబరం, కిరీటం, కంఠాభరణం- మొదలుగా తన పరత్వానికి తగినవి అయిన పలు ఆభరణాలను అలంకరించుకొని, అధరం, నేత్రాల తేజస్సు ఎఱ్ఱగా వ్యక్తం కాగా, బంగారు రంగును కల వాటి అన్నిటితో శ్యామలమైన తిరుమేని వర్ణం పోటీపడి ప్రకాశిస్తూ ఉండగా (పరభాగశోభతో ప్రకాశిస్తూ ఉండగా) విరోధులపై విషాన్ని కక్కుతున్న పలు తలలను కల ఆదిశేషుడనే పడుకను అధిరో హించి, అలలు వీచే పాలకడలిలో జగద్రక్షణచింతన అనే నిద్రలో ఉండి, బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన సకలదేవసమూహాలు దర్శించి అంజలి ఘటించేటట్లు శయనించిన, జగత్కారణం అయిన తిరునాభీకమలాన్ని కల అద్వితీయమహానాయకా!

త్రివిక్రముడవై ముల్లోకాలను కొలిచిన ఎమ్బెని శ్రీచరణాలను కలవాడా! జయ విజయీ భవ!

ఈ పాశురంలో భగవానునకు మరకతపర్వతం, అతని పీతాంబరం, కిరీటం, కంఠాభరణం, ఇంకా ఉండే తిరువాభరణాలు మొదలైనవానికి క్రమంగా- మేఘం, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు- అనేవి, ఎమ్బెని అధరం, తిరునేత్రాలు మొదలైన వానికి ప్రవాళమయం అయిన పర్వతప్రదేశాలు ఉపమానాలు. ఇంతవరకు భగవానుని రూపసౌందర్యం ఒక మరకత పర్వతాన్ని ఉపమానంగా గ్రహించి అనుభవింపబడింది.

బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు- మొదలైన గొప్పతనాన్ని కల దేవతలు, చేతులెత్తి నమస్కరించేటట్లు స్వామి శయనించి ఉన్నాడు. కనుక పరదేవతాత్వమనే పరత్వం అనుభవింపబడింది. "రుద్రం సమాశ్రితాః దేవా రుద్రో బ్రహ్మాణ మాశ్రితః, బ్రహ్మా **మమాశ్రితో రాజన్! నాహం కంచిదుపాశ్రితః"** (భారతమ్ - అశ్వ - 118-37) (దేవతలు రుద్రుని ఆశ్రయించారు. రుద్రుడు బ్రహ్మదేవుని ఆశ్రయించారు. బ్రహ్మ నన్ను ఆశ్రయించాడు. నేనెవ్వరినీ ఆశ్రయించ లేదు) - అని అన్నాడు కదా! అద్వితీయ మహానాయకుడైన **("తని ప్పెరునాయకన్")** అయిన భగవానుడు **"తామరై యున్ది"** అని అన్నందువల్ల జగత్కారణత్వమనే పరత్వమే సూచింపబడింది. పాలసముద్రంలో బ్రహ్మాదులు మాత్రమే సేవించదగిన ఇటువంటి రూపసౌందర్యంతో త్రివిక్రముడై, ఈ లోకంలో అవతరించి అందఱి కన్నులకు లక్ష్యభూతుడై, తన శ్రీచరణాలను వశిష్ఠచండాలాది వ్యత్యాసం లేకుండా అందఱి శిరస్సులపై పెట్టిన సౌలభ్య- సౌశీల్యాలు **("నీర్మై") "మూవులకళన్ద శేవడియోయ్"** అని అనడంద్వారా వివరింపబడ్డాయి.

ఈ పాశురంలో పలు విశేషాలతో కూడిన **"మూవులకళన్ద శేవడియోయ్!"** అనే సంబోధన ఒక్కటే తప్ప, నీవు పల్లాండు పల్లాండుగా వర్ధిల్లాలి- అనే అర్థం ఇచ్చే ఏక్రియా పదం లేదు. దానికి కారణం ఏమంటే - భగవానుని సహజసౌందర్యంలోను ఆభరణశోభలోను, శయనించి ఉండే వైలక్షణ్యంలోను, ముల్లోకాలను కొలిచిన సౌలభ్యంలోను మనస్సు పాఱవేసుకొని (మనస్సు ఆకర్షింపబడి) అనుభవిస్తున్నందువల్ల ఏ సమాపక క్రియాపదాన్ని ప్రయోగించి పాశురాన్ని ముగించలేకపోయారు ఆழ్వార్లు- అని **మహావిద్వాన్ శ్రీకాంచీ ప్రతివాది భయంకరమ్** అణ్ణంగరాచార్యస్వామివారు తమ దివ్యార్థదీపికలో సూచించి, ఆழ్వార్ల భగవదనుభవం పూర్ణత్వాన్ని పొందకపోవడాన్ని తెలిపారు. అనుభవం ముగిస్తేకదా క్రియాపదాన్ని గూర్చిన ఆలోచన వస్తుంది- అని భావం.

భగవానుడు పాలసముద్రంలో అరుదైన శయనసన్నివేశంలో అమరి ఉండడానికి ఉపమానంగా మరతకపర్వతం సముద్రుని చేతులలో నిద్రించడం చెప్పబడింది. ఈ సందర్భంలో, గొప్పవారిని ఉద్దేశించినపుడుకదా గౌరవం స్ఫురించేటట్లు **"కణ్వళర్ వదు"** అని చెప్పాలి?- అనే సందేహం ఇక్కడ కల్గుతుంది. దీనికి "దేనిని ఉద్దేశించి చెప్పినా గౌరవం స్ఫురించేటట్లు చెప్పడం పెద్దల స్వభావం'' అన్నది సమాధానం. ఈ సందర్భంలో దీనికి దృష్టాంతంగా- తిరుమలైనంబి శ్రీసూక్తిని ఉట్టంకిస్తున్నారు- వ్యాఖ్యాతృసార్వభౌములైన పెరియవాచ్చాన్ పిళ్ళై. భగవద్రామానుజులతో, తిరుమలై నంబి ఒకరినిగూర్చి గుర్తు చెప్పేటపుడు **"పొన్నాలే తోడు పణ్ణినాల్ ఇడఒణ్ణాతపడియాన కాదై యుడైయరాయిరుక్కుమవరై దేవరీర్ అఱిన్దిరుక్కై యుణ్డో?"** (బంగారంతో కుండలాలను చేస్తే (వాటిని) పెట్టడానికి వీలులేని చెవులను కలవారిని మీరు తెలియుదురా!) అని, తిరుమలనంబి పల్కిన శ్రీసూక్తియే అది. ఒక చెవులు తెగిన వానిని, లేక చెవులు కుట్టుకొనని (కర్ణవేధ అనే వైదికసంస్కారం లేని) మ్లేచ్ఛుని ఉద్దేశించి గుర్తును చెప్పే నమ్బి, బంగారంతో కుండలాలు చేస్తే వాటిని పెట్టడానికి సాధ్యం కాని రీతిలో చెవులు తెగినవానిని, లేక కుట్టనివానిని, చాలా అధమునిగూర్చి గౌరవం స్ఫురించేటట్లుగా **"పొన్నాలే పణ్ణిన తోడు"** అని, **"కాతై యుడైయరా యిరుప్పారొరువర్"** అని ఉన్నతంగా పలికారు - అని భావం.

అంతేకాక, పెరియవాచ్చాన్పిళ్ళై ఈ పాశురంలో **"కవర్తలై అరవిన అమళి ఏఱి"** అనే చోట భగవానుని స్పర్శవల్ల కల్గిన సంతోషంతో శరీరం ఉబ్బి తబ్బిబ్బై తలలు అనేకంగా విస్తరించిన వృద్ధిని కల్గిన ఆదిశేషుడు భగవానుని తన ఒడిలో శిశువునువలె పెట్టుకొని తల్లివలె కాపాడడాన్ని ఉద్దేశించి, దీనికి ఉపపాదకంగా ఆదిశేషావతారం అయిన తిరుమలై అనన్దాళ్వాన్ శ్రీరంగనాథుడనే పేరును కల శ్రీపరాశరభట్టరును తిరుకోట్టియూర్కు పోయి చూచి, వారిని తన ఒడిలో పెట్టుకొని ఎండపడకుండా కాపాడిన చరిత్రను ఉట్టంకించారు. అనన్దాళ్వాన్, భట్టర్ తిరుమేనిపట్ల ప్రేమను కలవారు. భగవద్రామానుజులకు తరువాత ఈలోకంలో వేంచేసి ఉన్న ఎమ్బార్ కొన్నాళ్ళు ఉండి పరమపదానికి వేంచేసిన తరువాత భట్టరే దర్శనప్రవర్తకులై ఉన్నందువల్ల, భగవద్రామానుజులు తమను ఆదరించేటట్లే భట్టర్నుకూడా భావించమని శిష్యులకు నియమించినందువల్ల, తిరుమలై అనన్దాళ్వాన్ భట్టర్ను ఈ విధంగా కాపాడడంలో ఆశ్చర్యం లేదు. భట్టర్ మేల్నాడులో వేదాంతిని జయించడంకోసం వేంచేసినపుడు దారిలో శిఱుప్పుత్తూర్లో భట్టర్ చూచిన అనన్దాళ్వాన్ భట్టర్ రాకకు గల కారణాన్ని తెలిసికొని, "మా కులానికి రాజా!

(ప్రపన్నకులనాథా!) రండి'' అని భట్టర్‌ను ఎత్తుకొని ఆలింగనం చేసికొన్న విషయం, భట్టర్‌వద్ద అనన్దాZ్వాన్‌కు గల గౌరవ్యతాప్రతిపత్తికి తగిన ప్రమాణం. ఇటువంటి గత చరిత్రను ఉట్టంకించడం- (ఎందుకంటే) ప్రస్తావించిన విషయాన్ని బాగా మనస్సులో నాటుకొనే టట్లు చేయడంకోసం; ఆ చరిత్రలు మనకు తెలిసి, మనం ఆనందించడంకోసం.

2. మొదటి పాశురంలో భగవానుని దివ్యమంగళవిగ్రహ వైలక్షణ్యాన్ని ప్రధానంగా అనుభవించిన ఆZ్వార్లు ఆ స్వామి విషయంలో కలిగే పరభక్తి -పరజ్ఞానం- పరమభక్తులు ప్రాప్యాలు కనుక, అటువంటి భక్తి ఒక్కటే చాలు, వాటికంటే వేఱయిన ఐశ్వర్యం కాని, కైవల్యం కాని, భగవత్కైంకర్యం కాని, ఇక ఏవిధమైన ఫలాలు వద్దు- అని ఈ రెండవ పాశురంలో అంటున్నారు- **"ఉలకు పడైత్తు"** అని ప్రారంభించి.

తాత్పర్యం :- సంకల్పమాత్రంతో సమస్తలోకాలను సృష్టించి, ప్రళయమనే ఆపద వచ్చినపుడు వాటిని ఆరగించి, ఉదరంలో పెట్టుకొని, రక్షించిన నా స్వామియొక్క శబ్దించే (ధ్వనించే) వీరకడియాలను కల - చాలా కాంతిని కల తామరలవంటి శ్రీచరణాలను తలపై అలంకరించుకోవడానికి ఆశ పడుతున్న నా ఆత్మ (తిరుమేని సౌందర్యం, పరత్వం, సౌలభ్యం- అనే భగవానుని వైలక్షణ్యాలను భావించడంవల్ల) నీరై కఱగి, స్థితి శిథిలం కాగా, అందువల్ల కల్గిన ప్రేమ అనే సంగం ఏర్పడగా, ఆ సంగంవల్ల నిరంతరమైన ధ్యానం అనే ఆనందరూపమైన స్నేహం కలుగగా, అది తేనెవలె మధురం కాగా, అటువంటి ధ్యానం ముదిరి అమృతప్రవాహంవంటి భక్తియొక్క పూర్ణమైన పక్వదశ అయిన పరమభక్తిని కల్గించగా, అటువంటి పరమభక్తి అనే అమృతప్రవాహంలో మునిగి ఉండడం అనే గొప్పతనాన్ని (గొప్ప సంపదను) విడచి, ఐశ్వర్య - కైవల్య - భగవత్కైంకర్యాలలో దేనినైనా ఒకటిని పొందడంకోసం శ్రమపడి ప్రయత్నం చేసేవారు ఆ విధంగానే శ్రమపడి అలమటించనీ. భ్రమ అనే కలత ఏమాత్రం లేని స్వచ్ఛమైన మనస్సును కలవారి భావన అనేది- సంపదలు స్థిరంగా ఉండి, విషయానుభవశక్తికూడ నిత్యంగా పొందగల్గినా, ముల్లోకాలను ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏల గల్గినా ఏమి ప్రయోజనం? పరమపదంలో భగవదనుభవకైంకర్యం అనే విలక్షణమోక్షమే పొందినా వాటిని స్వీకరించాలని తలుస్తుందా?

స్వచ్ఛమైన జ్ఞానం కల్గినవారి మనస్సు పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులను గొప్పవిగా తలుస్తుందే తప్ప ఐశ్వర్యాదులను ఒక వస్తువుగా భావించదు- అని అంటున్నారు. ఈ పాశురంలో. త్రైలోకాధిపత్యం అనే ఐశ్వర్యం అస్థిరమైనందువల్ల,

అణురూపం అయిన జీవాత్మయొక్క అనుభవం చాలా అల్పం అయినందువల్ల, పరమపదంలోని భగవదనుభవానికి ఈ రెండు కొఱతలు లేకపోయినా, అది ఆశపడిన శరీరాన్ని విడచి ఇంకొక శరీరాన్ని గ్రహించి అనుభవించవలసి ఉన్నందువల్ల, వాటిని ఒక వస్తువుగా భావించకుండా దానికి వ్యతిరేకంగా పరమభక్త్యాదులు స్థిరాలై, అనల్పాలై, ఈ శరీరంతోనే పొందదగినవిగా ఉండడంవల్ల, వాటినే గొప్పవిగా వివేకాన్ని కలవారి మనస్సు భావిస్తుంది- అని భావం. ఇక్కడ కైవల్యాన్నిగూర్చిన ప్రస్తావన ప్రత్యేకంగా లేకపోయినా, **"నల్ వీడు"** అని మోక్షానికి **"నల్"** అనే విశేషణాన్ని ప్రయోగించడాన్నిబట్టి **"పొల్లా వీడు"** అయిన నీచమోక్షమైన కైవల్యాన్ని నిరసించడాన్ని ఊహించి, త్రైలోక్యైశ్వర్యంకంటే గొప్పది కావడంవల్ల, పరమపదానుభవమైన గొప్ప మోక్షంకంటే నీచమైనది కావడంవల్ల, ఆ కైవల్యం ఆరెండింటికి నడుమ ప్రస్తావింపబడిందని గ్రహించాలి.

వీరు ఈ విధంగా అనుగ్రహించడానికి మూలం - వీరికి ముందు అవతరించిన తిరుమழிశైప్పిరాన్ అనుగ్రహించిన **"కేడిల్ శీర్వరత్తన్"** అనే తిరుచ్ఛన్దవిరుత్త (108) పాశురమని ఊహించి తెలియవచ్చు- అని శ్రీకాంచీప్రతివాది భయంకరమ్ అణ్ణంగరా చార్యస్వామి తమ దీపికా వ్యాఖ్యలో సూచించారు. బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన వారి లోకాలను పొంది, పాలించగల్గినా, మోక్షమనే గొప్ప పరమపదానుభవాన్నే పొంది ఆనందమయంగా ఉండ గల్గినా, భగవానునితో చేరాలి. చేరాలి అనే ఆశపడి ఉండడం అనే భక్తిని విడచి వేఱొకటిని మనస్సులో తలుస్తానా? అనేది ఆ పాశురభావం. ఈ పాశురంలోని భావంతో ఇంచు మించుగా పోలి ఉండడాన్ని గమనించవచ్చు.

ఈ ఆழ்వార్లే పెరియతిరువన్దాదిలో **"ఒన్ఱుణ్డు శెఙ్గణ్మాల్"** (53) అనే పాశురంలో భగవానుని సంబోధించి "పుండరీకాక్షుడవైన స్వామీ! నీదాసుల విషయంలో అన్ని ఉపకారాలను నీవు చేసినా, "నా దాసులకు ఇంకా ఏమి చేయగలను? ఏమి చేయగలను?'' అని చింతాక్రాంతుడవై ఉంటావు. నీ కల్యాణగుణాలలో ఆసక్తమై ఉండే చింతనకంటే (భక్తికంటే) నీ దాసులకు వైకుంఠమని గొప్పగా చెప్పే పరమ పదానుభవం రుచిస్తుందా?'' అని సర్వజ్ఞుడవైన నీకుకూడా నేను ఒక విషయాన్ని విన్నపించవలసి ఉన్నది- అని పల్కిన దానినిబట్టి భక్తిని కల్గి ఉండడంలో ఈ ఆழ்వార్లకు ఉండే దృఢమైన అధ్యవసాయం తెలియదగినది.

శ్రీరామచంద్రుడు అవతారకృత్యాన్ని అంతటిని పూర్తి చేసికొని, పరమపదానికి తిరిగి వెళ్ళే సమయంలో హనుమానుని "నాతో కూడ నీవు రా'' అని పిలిచినపుడు,

"మహారాజా! దశరథునకువలె నాకు నీపట్ల స్నేహం ఉన్నది. లక్ష్మణునకున్నట్లు నాకు నీ పట్ల భక్తి స్థిరంగా ఉన్నది. శ్రీరామచంద్రుడవైన నీపట్ల ఉండే స్నేహంవల్ల, భక్తివల్లనే ఈ లోకంలోనే నీవు ఆలింగనం చేసికొన్న ఈ శరీరాన్ని ఆఘ్రాణిస్తూ ఉండాలని ఆశపడే నాకు ఇంకొక చోట మనస్సు పోదు. నేను రాను-'' అని బదులు పల్కిన (శ్రీరామాయణంఉత్తరకాండమ్-40-15) **"స్నేహో మే పరమో రాజన్!"** అనే శ్లోకం ఈ ఆழ்వార్లకు మూలం అని చెప్పవచ్చు.

ఈ ఆழ்వార్లను అనుసరించి తొండరడిప్పొడి ఆழ்వార్లు శ్రీరంగనాథుని చూచి **"అచ్చుతా! అమరరేఱే! ఆయర్‌తమ్ కొழுన్దే !"** అని పల్కి అనుభవించే తిరునామ సంకీర్తనరసానుభవం తప్ప, అందని లోకంలో అనుభవించే మోక్షరసానుభవాన్ని "నేను కోరను'' అని తన నిశ్చయాన్ని విన్నపించిన **"పచ్చై మామలైపోల్"** అనే (తిరుమాలై-2) పాశురం, తిరుప్పాణాழ்వార్లు **"అణియరఙ్గన్ ఎన్నముదినై క్కణ్డ కణ్‌గళ్ మற்ఱొన్ఱినై క్కాణావే"** (అమలనాదిపిరాన్-10) అని అర్చావతారానుభవరసాన్ని విడచి పరత్వాను భవం కూడా వద్దని దృఢంగా పల్కిన పాశురం ఇక్కడ అవశ్యం అనుసంధేయాలు.

ఈ పాశురంలో మొదటి భాగం భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీవైకుంఠ గద్యానికి మూలం అని చెప్పవచ్చు. శ్రీవైకుంఠగద్యలో భగవద్రామానుజులు ఇతరులకు ఉపదేశించే భక్తియోగం- భక్తి అనే భగవద్ధ్యానం మూడు విభాగాలను కల్గినది అని గ్రహించడం తగినది. మొదట ప్రకారం అయిన పరభక్తి- చూడాలనే ఆశ, కలవాలనే ఆశ- మొదలైన మనోరథమయంగా ఉంటుంది. రెండవది అయిన పరజ్ఞానం- దర్శించదగిన, పొందదగిన వస్తువునుగూర్చిన ఆశతో కూడిన మానస సాక్షాత్కారరూపంగా ఉంటుంది. మూడవది అయిన పరమభక్తి- ఆశతో కూడిన ఆశపడ్డ వస్తువుయొక్క పూర్ణానుభవరూపంగా ఉంటుంది- ఈ అనుభవమే- **"అకలకిల్లేన్"** అనే రీతిలో చేస్తుంది.

1. శ్రీవైకుంఠానికి పోయి భగవానుడైన నారాయణుని ఎపుడు కన్నులతో దర్శించగలను? ఎపుడు అతని శ్రీచరణపద్మద్వయిని తలపై ధరించగలను? ఎపుడు శ్రీపాదాలను సమీపించి విశ్లేషించకుండా ఉండగలను? ఎపుడు నన్ను భగవానుడు చల్లగా కటాక్షించి తన కైంకర్యాలలో నియమించుకుంటాడు? అనే ఆశను వృద్ధిచేసికోవాలి- అని ఉపదేశిస్తున్నారు- ఇది పరభక్తి.

2. తరువాత భగవానుని దరి చేరి సేవించి, అతనిచే కటాక్షింపబడి చాలా సన్నిహితుడై, "దాసుణ్ణి కైంకర్యం చేయడం కోసం అంగీకరించాలి'' అని ప్రార్థించి,

దండం సమర్పించి తనను ఆ భగవానునకు సమర్పించాలి. ఆ తరువాత భగవానునిచే అంగీకరింపబడి నిత్యసూరులతో కూడి అతనినే నిరంతరం దర్శిస్తూ ఉండాలి- అని ఉపదేశిస్తున్నారు. ఇది పరజ్ఞానం.

3. దానికి తరువాత భగవానుడు తానే కటాక్షించి, మందహాసం చేసి దగ్గరకు పిలిచి, దుఃఖాన్ని అంతటిని తీర్చేటట్లు, చాలా గొప్ప ఆనందాన్ని ఇచ్చేటట్లు ఉండే తన శ్రీచరణపద్మయుగ్మాన్ని శిరస్సులో పెట్టినట్లు ధ్యానం చేసి, ఆ ధ్యానం అనే లోతైన సముద్రంలో మునిగిన అన్ని అవయవాలను కలవాడై, సుఖంగా ఉండాలి అని ఉపదేశిస్తున్నారు. ఇది పరమభక్తి.

ఈ జ్ఞానాన్ని విస్తృతంగా భగవద్రామానుజులు శ్రీవైకుంఠగద్యంలో ఉపదేశించిన పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులను నమ్మాZ్వార్లు తిరువాశిరియంలోని ఈ రెండవ పాశురంలో సంగ్రహంగా అనుగ్రహించడాన్ని ఇక గమనిద్దాం. ఈ పాశురంలో ఉండే **"ఉలకు పడైత్తుణ్ణ ఎన్దై అఱైకZల్ కడల్ పూన్దామరై"**- అనేవి శ్రీవైకుంఠనాథుని శ్రీచరణపద్మాలే. ఎందుకంటే, ఈ సూక్తికి అవతారికను అనుగ్రహిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై **"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"** అని ప్రకృతి మండలానికి ఆ వైపున (పరమపదంలో) ఉండే సూర్యునితో సమానమైన తేజస్సును కల భగవానుని సూచించే పురుషసూక్త వాక్యాన్ని ఉదాహరించడంవల్ల. అటువంటి శ్రీవైకుంఠనాథుని శ్రీచరణాలను శిరస్సుపై ధరించాలనే ఆశ, అంటే - పరభక్తి **"అఱైకZల్ శుడర్ పూన్దామరై శూడుదఱ్కు అవావు ఆరుయిర్"** అని అన్నందువల్ల సూచింపబడింది. ఈ అభినివేశం గద్యలో మొదటి ప్రకారంలో పరభక్తిగా చెప్పబడ్డ అభినివేశాలు అన్నిటికి ఉపలక్షణం. ఈ విషయం **"అవావు ఆరుయిర్ ఉరుకియుక్క నేరియకాదల్ అన్బిలిన్బీన్ తేఱల్"** అని అంటూ ఆ అభినివేశంయొక్క ఇంకా ఇంకా అభివృద్ధినిగూర్చి పల్కడాన్నిబట్టి తెలియవచ్చు.

దీనికి తరువాత గల **"అముదవెళ్ళత్తానామ్ శిఱప్పు విట్టు"** అనే ప్రయోగం, గద్యలో భగవానుడు తన శ్రీచరణపద్మయుగళాన్ని ఆశపడిన రీతిలోనే తలపై పెట్టినట్లుగా ధ్యానించి, ఆ ధ్యానం అనే అమృతసముద్రంలో మునిగిన అన్ని అవయవాలను కలవాడై సుఖంగా ఉండే ఉన్నట్లు పల్కడానికి సంగ్రహం. **"అమృతసాగరాంతర్ని మగ్నః సర్వావయవః సుఖ మాసీత"** అనే సూక్తి, **"అముద వెళ్ళత్తానామ్ శిఱప్పు"** అనేసూక్తి ఒకటే కదా. **"శిఱప్పు"** - అంటే సుఖరూపమైన గొప్పసంపద.

తిరువాశిరియంలో పరభక్తి- పరమభక్తి. దశలలో మధ్య పరజ్ఞాన దశ- అంటే- మానస సాక్షాత్కార దశ స్పష్టంగా లేకపోయినా, అర్థాత్ సిద్ధించినట్లుగా గ్రహించాలి.

శ్రీచరణాలను చేరాలి అనే ఆశ, శ్రీచరణాలను మనోనేత్రంతో దర్శిస్తే తప్ప నిలువ లేనందువల్ల - అని భావం.

ఇందువల్ల, భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీవైకుంఠగద్యకు ఈ పాశురం మూలం- అని తెలిసినంతవరకు విన్నపింపబడింది. పెద్దలు ఈ విషయంలో ప్రమాణం.

3. మొదటి పాశురంలో భగవానుని దివ్యమంగళవిగ్రహసౌందర్యాన్నిగూర్చి పలికారు. రెండవ పాశురంలో అతనిని పొంది పరమపదంలో అనుభవించి, ఆనందించడంకంటే అతని విషయంగా చేసే స్వయంప్రయోజనమైన భక్తియే తీయనిది- అని అన్నారు. ఆ భక్తికి విషయం భగవానుడే కాక, అతనిపట్ల భక్తిని కల్గిన భాగవతులు కూడా- అని ఈ పాశురంలో అంటున్నారు.

**తాత్పర్యం :-** మూడు లోకాలలో ఉండే సకలజీవాత్మలు సన్మార్గంలో నడిచే టట్లుగా మనస్సులో భావించి, వారు అందఱు ఒకటిగా కూడి తనను ఆశ్రయించి నమస్కరించడానికి తగిన ప్రసిద్ధమైన కీర్తిని కలవాడై, తన ఆజ్ఞను పూర్ణంగా ప్రవర్తింపజేసేవాడై, బ్రహ్మ, శివుడు, ఇంద్రులకంటే గొప్పవాడై, ఆభరణాల కాంతితో ప్రకాశించే వక్షఃస్థలాన్ని కలవాడై, పర్వతాలవంటి ఉన్నతాలైన కెరటాలు ఒకదానితో వేఱొకటి తాకగా పెద్ద కులపర్వతాలు సైతం కంపించేటట్లుగా పిడుగువలె గర్జన ధ్వని వ్యాపించిన పాలసముద్రాన్ని తన కరస్పర్శతో కల్గిన సంతోషంతో వికసించిన పడగలను కల సర్పరాజైన వాసుకిని విశాలమైన మందరపర్వతాన్ని చుట్టి, అమృతం లభించేవరకు చిలికినవాడై, తనతో సాటి వారు, మేటివారు లేని పరదేవత అయిన భగవానుని దాసులైన శ్రీవైష్ణవులకు ఇకపై అయినా మనం శేషభూతులుగానే, స్వస్వాతంత్ర్యలేశం కూడా లేకుండా ప్రతికల్పం ఉండేటట్లున్న దశ మనకు ప్రతిక్షణం నిరంతరం అవిచ్ఛిన్నంగా సంభవిస్తుందా?

ఇక్కడ, భాగవతపర్యంతంగా మనకు కైంకర్యాన్ని చేసేవాడు ఎవడైనా లభిస్తాడా? అని అటువంటి వ్యక్తిని వెదకి తిరిగేవాడై భగవానుడుండగా, ఆழ்వార్లుకూడా తిరువిరుత్తంలో **"తిరుమాల్ తిరుప్పేర్‌వల్లార్ అడిక్కణ్ణి శూడియ మాఱన్"** అని ఇంతకుముందే తాము భాగవతులకు శేషమై ఉన్నట్లు అన్నారుకదా. 'భాగవతులకు శేషమై ఉండే భాగ్యం మనకు లభిస్తుందా!'- అని మళ్ళీ ఆழ்వార్లకు ఎందుకు సందేహం ఏర్పడింది?- అనే ప్రశ్న కల్గుతుంది. దానికి- నిత్యసూరి నాయకుడైన భగవానుడే

మనలను కాపాడడంకోసం రామకృష్ణాదులుగా అవతరించినా, కంసశిశుపాలాదులు అతనిపట్ల తమ విషయంలోవలె మనుష్య సజాతీయతా ప్రతిపత్తిని కల్గి నశించిపోయినట్లే, భాగవతుల గొప్పతనాన్ని తెలియలేకుండా, "వీరుకూడా మనవలె అన్నపానాదులతో దేహధారణను చేసేవారు కనుక, వీరు మనకంటే ఏవిధంగా గొప్పవారు!'' అని వీరిని తమతో సమానంగానే భావించిన సంసారులు అనర్థాన్ని పొందుతున్న రీతిని చూచి, వారి నడుమ ఉండే మనకుకూడా మన దుష్కర్మవల్ల అటువంటి అనర్థం కల్గుతుందో? ఏమో! అని భయపడి, ఆ విధంగా లేకుండా భాగవతులకు శేషమై ఉండే స్థితి లభిస్తుందా? అని సందేహిస్తున్నారు- అనేది సమాధానం. భగవచ్ఛేషత్వం లభించినా, భాగవతశేషత్వం లభించదు. అహంకార మమకారాలు పూర్ణంగా నశిస్తే కదా భాగవతశేషత్వం సిద్ధిస్తుంది. అందువల్లనే అహంకారమమకారాలు నశించిన స్థితిని తెలిపే మూలమంత్రాల నడుమన ఉండే నమఃపదంలో భాగవతశేషత్వాన్ని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడిలో అర్థసిద్ధంగా అనుగ్రహించారు. **"ఉ\తుమ్ ఉన్నడియార్క్కడిమై"- ఎన్గిఅపడియే ఇదిలే భాగవతశేషత్వముమ్ అనుసంధేయమ్"** (ముముక్షు-89) అనే చూర్ణికను అనుసంధించాలి.

ఈ పాశురంద్వారా భగవానుడు దురభిమానం గల దేవతలకుకూడా సముద్రాన్ని చిలికి అమృతాన్ని ఇచ్చిన వాత్సల్యసౌశీల్యాది గుణాలలో అభినివేశాన్ని పొంది, అతనికి దాసులైన భాగవతులకు తాము నిరంతరం దాస్యాన్ని చేయాలని ఆశపడ్డారు.

4. పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులను భాగవతపర్యంతంగా కల్గి, ఆ భాగవతులకు కైకంర్యాన్ని చేసే భాగ్యం మనకు ఆత్మ ఉన్నంతవరకు (శాశ్వతంగా) లభిస్తుందా! అని మూడవ పాశురంలో అనుగ్రహించిన ఆళ్వార్లు ఆ భాగవతులు భగవానునకు మంగళాశాసనాన్ని చేయడం చూచి, వారివలె భగవానుని శ్రీచరణాలను యావదాత్మ భావిగా ఎల్లప్పుడు నిర్విఘ్నంగా "వర్ధిల్లాలి! వర్ధిల్లాలి!'' అని అంటూ మంగళాశాసనం చేసే భాగ్యం మనకు లభిస్తుందా !- అని ఆశపడుతున్నారు- ఈ నాల్గవ పాశురంలో, **"ఊZతోరూZ"** ఇత్యాదిగా.

**తాత్పర్యం :-** అన్ని లోకాలు, జీవాత్మలు ఏమీ లేని (అసత్తు అనదగిన) స్థితిలో ఉండే ముందు గడచిన ప్రళయకాలంలో అసంఖ్యాకాలై, శరీరాదులతో కూడిన జీవాత్మలనే వస్తువులకు అన్నిటికీ - ఒకేచోట దుర్లభాలైన నిమిత్తకారణం, ఉపాదాన

కారణం, సహకారి కారణం- అనే ఈ మూడు తాను ఒక్కడై ఉండి, అణ్డసృష్టివరకు తానే చేసి, దేవ-తిర్యక్- మనుష్య స్థావరసృష్టిని చేయడంకోసం చతుర్ముఖ బ్రహ్మ అనే శక్తిని మిక్కిలిగా కల మొలకను సృష్టించి, అతని మూలంగా సంహారదేవత అయిన రుద్రునితోపాటు ఇంకా ఉండే కార్యకర్తలైన పలువురు పురుషదేవతలను సంకల్పంతో సృష్టించి, - ఈవిధంగా పైన, క్రింద, నడుమన గల ముల్లోకాలను సృష్టించిన తిరునాభీకమలాన్ని కల్గిన, ఆశ్చర్యశక్తిని పొందిన, పరమకారణస్వరూపుడైన పరదేవతయొక్క శ్రీచరణాలను కల్పాల తరబడి కల్పాల, తరబడి అవిచ్ఛిన్నంగా **"వాழియ! వాழియ"** (మంగళం, మంగళం) అని పల్కి మంగళాశాసనం చేసే భాగ్యం ఇంతవరకు లేకపోయినా ఇకపై అయినా మనకు సంభవిస్తుందా?

ఈ పాశురం ద్వారా, ఒకేచోట చేరి ఉండని మూడు విధాలైన కారణత్వాలను తనలో ఇముడ్చుకొని, సకలజగత్సృష్టిని చేసిన భగవానునియొక్క ఆశ్చర్యశక్తిలో అభినివేశాన్ని పొంది, అతనికి పల్లాణ్డు పాడాలని ఆழ்వార్లు ఆశపడుతున్నారు. ఈ ఆశ వీరికి మొదటి పాశురంలో భాగవతశేషత్వాన్ని ఆశపడడానికి ఫలంగా కల్గింది. భాగవతులు సంతోషించి చేసేదేకదా మంగళాశాసనం. దీనిమూలంగా ఆழ்వార్లు భాగవతుల అభిమానాన్ని పూర్ణంగా పొందారనే విషయం ఇక్కడ భావ్యం.

5. భగవానుడు తనకు మంగళాశాసనం చేయాలని ఆశ పడిన ఆழ்వార్లను చూచి "ఆழ்వార్లూ! నాకు పల్లాణ్డు పాడాలని ఆశ పడిన మీ ఉద్దేశ్యం ఏమి?'' అని అడిగాడని తలచి ఆழ்వార్లు "స్వామీ ! దాసుడు ముందు పాశురంలో విన్నపించిన రీతిలో నీవు సకలసృష్టిని చేసి, దానికి రక్షణగా ఇంద్రాది దేవతలను నిలిపిన తరువాత, ఆ ఇంద్రుడు మహాబలి చేతిలో రాజ్యాన్ని కోల్పోయి, బాధపడినపుడు- ఇంతకుముందు "లేని ఈ లోకాన్ని సృష్టించాము, దానికి కావలిగా ఇంద్రాదులను సృష్టించి, వారికి దానిని వశం చేశాము. ఇంకా, మేము ఎంత చేయగలం! ఇంద్రుడు, అతని రాజ్యం ఏనష్టం (చెడ్డ) పొందినా పొందనీ!'' అని అలక్ష్యం చేయకుండా, శ్రియఃపతివై, ఇవ్వడం అనే అలవాటు పడిన (పరిణతిని పొందిన) నీ గొప్పతనాన్ని పాడు చేసికొని, మహాబలివద్ద చేతిని చాపి యాచించి, త్రైలోక్యరాజ్యాన్ని సంపాదించి ఇంద్రునకు ఇచ్చిన మహోపకారకుడవు నీవు ఒక్కడవే కదా! ఆశ్రితులలో ఒకనికి చేసిన ఉపకారం అందరికీ చేసిన ఉపకారంగాకదా భావించాలి! అందువల్ల వారిలో ఒకడను అయిన దాసుడు (నేను) నీకు తప్ప ఇంక ఎవరికి మంగళాశాసనం చేస్తాడు? అందువల్లనే నీకు పల్లాండు పాడాలని దాసుడు కోరుతున్నాడు- అని అంటున్నారు- **"మాముదల్ అడిప్పోదు"** అని ప్రారంభించి.

**తాత్పర్యం :-** స్వామీ! నీవు లోకాలను కొలువడానికి ప్రయత్నించినపుడు, పరమకారణమైన నీ శ్రీచరణపద్మాలలో ఒకటిని ఎత్తి వికసింపజేసి, దానికింద అంతా లోకం పెట్టి ఆక్రమించి, అందమైన కాంతిని కల ఇంకొక శ్రీచరణపద్మాన్ని చతుర్ముఖుడనే దేవతయొక్క లోకంలో ఉండేవారు ఆశ్చర్యపడి, ఆనందించేటట్లు, ఆ యా ప్రదేశాలలో ఉండే దేవతలు సన్మార్గాన్ని అనుసరించి, శాస్త్రాలు తెలిపిన రీతిలోనే ప్రర్తించేటట్లు ఆకాశంలో నిలిపి వ్యాపింపజేసి, తామరల వనం వికసించి నట్లున్న తిరునేత్రాలను, దొండపండువంటి అధరాన్ని కలవాడవై, చాలా గొప్ప వేయి సూర్యులు కలిసి ఉదయించినట్లుండే కిరీటాన్ని, పలు పలు కల్పకోద్యానాలవంటి, పలు వేలుగా వృద్ధి చెందిన బాహువులను కలవాడవై, చాలా గొప్పవాడవైన నీకు తప్ప ఇంక ఎవరికీ అయినా ఈలోకం శేషమై ఉన్నదా! (మావలె నీ శ్రీచరణాలక్రింద అణగి ఉండే ఇతరదైవాలకు ఈ లోకం శేషంగా ఉండే అవకాశం లేదు కనుక, మాతోపాటు, దేవతాంతరాలతో పాటు తేడా లేకుండా నీ శ్రీచరణాలను కిందపెట్టి అందఱిని రక్షించిన నీకే పల్లాండు పాడాలని ఆశపడుతున్నాను- అని భావం.)

ఈ పాశురంలోని **"నెడియోయ్ క్కల్లతుమ్ అడియతో ఉలకే!"** అని చివరి పాదంలో **"నెడియోయ్"** అనే పదానికి అంతు లేని గొప్పతనాన్ని కలవాడు- అనే అర్థాన్ని ఆదరించారు పెరియవాచ్చాన్పిళ్ళై. భగవానుడు మనకు ఎంత ఉపకారం చేసినా ఏమీ చేయనివానివలె తనను భావించి, కొఱతపడడం అనే చాలా గొప్పతనాన్ని కలవాడని భావం. ఒకడు తనను నమ్మి, తన ప్రక్క నిదురపోయేవాని ఒడిలో తడివి చూచి, "అయ్యో! నన్ను నమ్మినవాని విషయంలో ఈ విధంగా ప్రవర్తించామే!" అని పశ్చాత్తాపపడేటట్లు భగవానుడు- మనలను నమ్మిన ఇంద్రునకు మహాబలివల్ల ఉపద్రవం రాకుండా ఉండే రీతిలో ముందే యోచన చేసి అతనికి ఉపకారం చేయలేక పోయామే! అతనిని క్లేశపడేటట్లు చేశామే! అని సిగ్గుపడి, ఇంద్రునకు తాను ఏమి చేయనివానివలె తన కొఱతను (లోపాన్ని) తలచి అనుతాపాన్ని పొందడం అనే ఉపకారకత్వం యొక్క అంతు లేని మహిమను వ్యాఖ్యాత వివరించడం భగవద్గుణాను భవరసికులకు ఒక అరుదైన, పసందైన విందు.

6. మూడవ పాశురంలో తెల్పిన రీతిలో లోకం అంతా అతనికే శేషమై ఉండడంవల్ల ఆరాధనకు సులభుడైన ఆ స్వామిని ఆశ్రయించి క్రమంలో ప్రవర్తించి, శాశ్వతమైన సంపూర్ణమైన మోక్షసుఖాన్ని పొంది, పరమపదంలో ఆనందమయ జీవితాన్ని గడుప

వలసి ఉండగా, ఈ మూర్ఖలోకం రుద్రాది క్షుద్రదేవతలను, వేదంలోని స్తోత్రవాక్యాలు అయిన అర్థవాదాలలో చెప్పబడ్డవారిని మేక, పశువు, కోడి మొదలైనవానిని చంపి, చాలా శ్రమపడి వారికి నివేదన చేసి ఆరాధించి, వారివద్దనుండి అల్పం, నశ్వరం అయిన పశుపుత్రాదులు, ఆయుస్సు, ఐశ్వర్యం- మొదలైన సాంసారికఫలాలను పొంది, ఇంకా ఇంకా జన్మలను ఎత్తి, ఈ సంసారంలో పడి ఉండి, శబ్దాదివిషయాలనే సముద్రంలో పడి మునిగి దుఃఖపడుతున్నారే! ఇదేమి బుద్ధిహైన్యం! లోకం స్వభావం ఈ విధంగాకూడా ఉంటుందా! అయ్యో! అయ్యో! అని ఆక్రోశిస్తున్నారు- "ఓ ఓ ఓ ఓ" ఇత్యాదిగా.

**తాత్పర్యం :** ఒకతె బిడ్డను కనడానికి అవసరమైన నోములను అన్నిటినీ నోచి, తరువాత గర్భం ధరించి, ప్రసవవేదనను అనుభవించి, ప్రసవించి, తరువాత బాధపడి, ఆ బిడ్డను పలు రీతులలో రక్షిస్తే, ఆ బిడ్డ పెరిగి పెద్దవాడై, తల్లి చేసిన ఉపకారాన్ని తలచే అవధికి జ్ఞానం కల్గినపుడు అటువంటి అరుదైన తల్లిని వీడి ఏ ఉపకారం చేయకుండా, చేసిన ఉపకారాన్ని తలచలేకుండా ఉండే ఒక పీటకు స్నానం చేయించి నట్లుగా, లోకాలను మొదట సృష్టించి, దానిని హిరణ్యాక్షుడు అపహరించి తీసికొని పాతాళంలో ప్రవేశించగా, వరాహావతారాన్ని ఎత్తి, పాతాళానికి పోయి, అతనిని వధించి, ఆ భూమిని అండభిత్తినుండి విడదీసి ఉద్ధరించి తీసుకొనివచ్చి, తరువాత ఆలోకం అంతా ప్రళయంలో మునిగి పోయేటపుడు, వాటిని తన ఉదరంలో పెట్టుకొని రక్షించి, తరువాత బయటకు ఉమిసి, తరువాత త్రివిక్రముడై అవతరించి, కొలిచి, తిరిగి పరిగ్రహించి- ఈవిధంగా ఇంకా ఇంకా లోకరక్షణానికి తగిన ఉపాయాలనే చింతించి, లోకాలను రక్షిస్తూ వచ్చే అద్వితీయపరదేవత అయినవాడు- "ఎవరైనా నావద్దకు వచ్చేవారున్నారా?" అని ఎదురుచూస్తూ సిద్ధంగా ఉన్నా, వేదంలో ఒక మూలలో చెప్పబడి ఉండే చిన్న దైవాలను తమ రజస్తమోగుణాలకు తగిన రీతిలో దైవాలుగా తలచి, ఆశ్రయించి, దానివల్ల తమ జ్ఞానం అల్పం అనే విషయం పెద్దలు గ్రహించేటట్లుగా చేసి, మేకబలి, పశుబలి, కోడిబలి -మొదలైన తగని కార్యాలను చేసి ఆ దైవాలను పూజించి, వాటివద్దనుండి సుఖం, దుఃఖం కలిసిన ఫలాన్ని పొంది, అనాది అయిన గొప్ప మాయ అనబడే ప్రకృతి సంబంధంతో కలిగే జన్మలనుండి బయటపడే దారి లేక, మోహాన్ని కల్గించే శబ్దాదివిషయాలు అనే బురదలో పడి ఉండే రీతిలో లోకుల స్వభావం ఉన్నదే! అయ్యో! అయ్యో! ఎంత కష్టం! ఎంత కష్టం! అని అంటున్నారు.

**“ఏకస్మిన్నప్యతిక్రాంతే ముహూర్తే ధ్యానవర్జితే, దస్యుభి ర్మూషితేనైవ యుక్త మాక్రందితుం భృశమ్”** (భగవానుని ధ్యానం చేసేవాడు ఆ ధ్యానానికి కొంచెం అంతరాయం కలిగితే ఒకడు తన సంపద అంతా దొంగలచేత కొల్లగొట్టబడినపుడు ఏవిధంగా గొంతెత్తి బిగ్గరగా అఱచి ఏడుస్తాడో, ఆవిధంగా మిక్కిలిగా ఏడవడం తగినది) అని క్షణకాలవిస్మరణకే మిక్కిలిగా అఱచి ఏడవవలసి ఉండగా, చాలా దినాలుగా భగవానుని మఱచి, పశ్చాత్తాపం ఏమీ లేకుండా, దానికి ప్రత్యక్షవిరుద్ధంగా దేవతాంతరాలను ఆశ్రయించి నశించిపోయే సంసారులనుగూర్చి ఆళ్వార్లు విచారించారు. దీనివల్ల సంసారుల **“పొయ్న్నిన్ఱ ఞానమ్”** యొక్క కార్యం- పరదేవతను ఆదరించకుండా దేవతాంతరాలను ఆదరించడం, దానికోసం చేసే హింస అనే మొదలైన అన్ని అసత్ ప్రవర్తనలు, వానివల్ల మాయా జన్మ, ముఱికి శరీరాన్ని పొందడం. వీటిని తమకు, ఇతరులకు లేకుండా ఉండేటట్లు అనుగ్రహించడంకోసం మొదటిలోనే- **“యాముఱామై అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్ కేట్టరుళాయ్”** అని ప్రార్థించారు కదా! ప్రార్థించినా భగవానుడు కార్యాన్ని సఫలం చేయనందువల్ల తమనుగూర్చి తలచకుండా ఇతరులనుగూర్చి బాధపడుతున్నారు. ఇతరులు దుఃఖాన్ని సహించలేని పరమదయాళువుకదా ఆళ్వార్లు.

7. గడచిన పాశురంలో దేవతాంతరభజనాన్ని చేసి సంసారంలో పరిభ్రమించే లోకులను చూచి బాధపడ్డ ఆళ్వార్లు, “వీరిని చూచి దుఃఖపడడంలో ఏమీ ప్రయోజనం లేదు’’ అని తలచి, “వీరు ఏమైనా చేయనీ. మనం అయినా దేవతాంతర స్పర్శనుండి తప్పుకోగలిగాము కదా’’- అని తలచి తమ లాభాన్నిగూర్చి పల్కి ఆనందాన్ని పొందు తున్నారు- **“నళిర్మది చ్చడైయనుమ్”** అని ప్రారంభించే ఈ పాశురంలో

**తాత్పర్యం :** తన మనోరథం నెరవేరడంకోసం శ్రియఃపతిని ఉద్దేశించి తపస్సు చేసే ఉపాసకత్వం స్ఫురించేటట్లుగా చల్లని చంద్రుని అలంకరించుకొన్న జటను దాల్చిన రుద్రుడు, చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు, చిగురువంటి నీలవర్ణాన్ని కల దేవేంద్రుడు- అనే దేవతలు అందఱు, వారు జీవించే లోకాలు అన్నీ, వారికి కారణాలైన పంచభూతాలు, కాంతిని వెలువరిస్తున్న చంద్రసూర్యులు, ఇంకా ఉండే మనుష్యాదులు సూక్ష్మవస్తువులై తన చిన్న తిరుమేనిలో చేరేటట్లుగా ఏ వస్తువు జారిపోకుండా అన్నిటినీ దాచి రక్షించి, అద్వితీయమైన, విచ్చుకొనిన మఱ్ఱి చిగురుటాకులో నిద్రించి, మాకు స్వామియై, గొప్పవాడై పరిచ్ఛేదించడానికి వీలు కాని ఆశ్చర్యశక్తిని కల శ్రీమన్నారాయణుని తప్ప ఇంకొక చిన్న దేవతను మనం ఆశ్రయణీయునిగా కల్గి ఉన్నామా! ఆహా! మనం

చేసిన భాగ్యం ఎంత గొప్పది! **"బ్రహ్మాణం శితికంఠం చ యాశ్చాన్యా దేవతాః స్మృతాః, ప్రతిబుద్ధా న సేవంతే యస్మాత్ పరిమితం ఫలమ్"** (భార-మోక్ష- 116) (బ్రహ్మ, నీలకంఠుడైన రుద్రుడు, ఇంకా ఉండే ఇంద్రాది దేవతలను జ్ఞానులు ఆశ్రయించరు. ఎందుకంటే, వారివల్ల పొందే ఫలం, పరిమితమైనది కనుక) ఫలం పరిచ్ఛిన్నం కావడమే కాదు, వారిని ఆశ్రయించకూడదు కూడా) అనే దానికి ఇంకొక ప్రమాణం- **"స్కంధరుద్రమహేంద్రాద్యాః ప్రతిషిద్ధా స్తు పూజనే"** (స్కంధుడు, రుద్రుడు, దేవేంద్రుడు మొదలైన దేవతలు అయితే పూజింపబడే విషయంలో (పూజనీయులు కారు అని) నిషేధింపబడ్డారు- అని దీని భావం.

"ఈ క్షుద్ర దేవతలను ఆశ్రయించకుండా మనం తప్పాము కదా! మనం భాగ్యం ఎంత గొప్పది!" అని సంతోషంలో మునిగి, వేఱు దేనినీ తెలియకుండా, అన్ని ప్రబంధాలను అంతాదిగా అనుగ్రహించిన ఆళ్వార్లు ఈ ప్రబంధాన్ని అంతాదిగా చేయడం మఱచి పోయారు- అని అన్నారు పెరియవాచ్చాన్ పిళ్ళై.

ఇక్కడ, **"ఒరాలిలై చ్చేర్న్ద ఎమ్బెరుమా మాయనై యల్లతు ఒరు మాదెయ్వమ్ మ ற்றுడైయమో యామే"** అనే పాశురంలోని చివరి భాగాన్ని పైపైన చూస్తే 1. "భగవానుని ఆశ్రయించదగిన దేవతగా కల్గి ఉన్నాము'' అని, 2. "వేఱొక దానిని ఆశ్రయణీయ దేవతగా కల్గినవారం కాము'' అనే అర్థం తోస్తున్నది. నిజానికి ఈ భాగానికి మొదటి అర్థంలో ఊనిక లేదు, రెండవ అర్థం లోనే ఊనిక- అని అన్నారు వ్యాఖ్యాత. ఇతర దేవతలను విడువడమే ముఖ్యం. వాటిని విడిస్తే భగవానుని ఆశ్రయించడం అనేది తనకు తానే సిద్ధిస్తుంది- అనేది వారి అభిప్రాయం.

భగవానుని ఆశ్రయించడం అంటే- ఇతరదేవతలను ఆశ్రయించకుండా విడువడమే- అన్నది తేలిన అర్థం. ఏవిధంగా అయితే ఒక భర్తకు పెండ్లి చేయబడ్డ ఒక స్త్రీ ఆ భర్తతో సంబంధం లేనిదై ఉన్నా, ఇతరులతో సంబంధం లేనపుడు ఆ మాత్రంతోనే ఆ భర్తకు ఆమె పత్ని అవుతున్నదో, ఆ విధంగానే భగవానునకు శేషభూతులైన మనకు అతనిపట్ల సంబంధం లేకుండాపోయినా, దేవతాంతరాలకు శేషం కాని మాత్రంతోనే భగవానునకు శేషం అవుతున్నాము. అంటే- ఇతరులతో సంబంధం లేని స్త్రీకి కాలక్రమంలో భర్తతో సంబంధం కల్గి తీరుతుంది. స్వతంత్ర వస్తువు కాకపోవడం అనే స్త్రీత్వాన్ని కల్గినది కనుక. అదేవిధంగా, దేవతాంతర సంబంధం లేకుండాపోతే క్రమంగా భగవద్భక్తి మనకు తప్పక కల్గుతుంది- అన్నది వ్యాఖ్యాత యొక్క అభిప్రాయం.